# చరిత్రలు - కథలు

| | రూ | అ |
|---|---|---|
| శ్రీనాథకవి చరిత్ర | 0 | 12 |
| వేములవాడ భీమకవి | 0 | 12 |
| తెనాలిరామకృష్ణ | 0 | 12 |
| బమ్మెరపోతరాజు | 0 | 12 |
| శ్రీకృష్ణదేవరాయలు | 0 | 12 |
| నారదుని కథలు | 1 | 0 |
| సహస్ర శిరచ్ఛేద అపూర్వ చింతామణి | 3 | 8 |
| నలమహారాజుకథ-వచనం | 0 | 12 |
| పంచపాండవుల అజ్ఞాతవాసం పెద్దది బైండు | 1 | 8 |
| శ్రీరామవనవాసము | 1 | 0 |
| పరమానంద శిష్యుల కథలు | 0 | 6 |
| భోజకాళిదాసుకథలు | 0 | 12 |
| భట్టివిక్రమార్కునికథలు బైండు | 3 | 8 |
| డిటో 200 పే॥ గలది | 1 | 0 |
| డిటో 100 పే॥ గలది | 0 | 12 |
| స్త్రీలవ్రతకథలు 1, 2, 3 భా॥ | 1 | 0 |
| రైతుఋణచట్టము | 0 | 2 |
| పాండవవనవాసము | 1 | 0 |
| కాశీక్షేత్రమహాత్మ్యము | 0 | 12 |
| మహాపతివ్రతల కథలు | 0 | 12 |
| మదనకామరాజు కథలు | 1 | 0 |
| హరిశ్చంద్ర వచనం | 0 | 12 |
| మైరావణ చరిత్ర 200 పే॥ | 1 | 0 |
| వృద్ధపాండవం | 0 | 8 |
| అభయరాఘవము | 0 | 8 |
| సౌభ్రాత్రరాఘవము | 0 | 8 |
| విక్రమరాఘవము | 0 | 8 |
| ఆంధ్రుల కథలు | 0 | 12 |
| ఆంధ్రదేశపు కథలు | 0 | 12 |
| కోటిపత్రి కథలు | 1 | 0 |
| పెద్దాపుర సంస్థాన చరిత్ర | 1 | 0 |
| పద్మనాభుని యుద్ధము | 0 | 12 |
| ప్రాచీనాంధ్ర నౌకాజీవనము | 1 | 8 |
| ప్రాచీనాంధ్ర విద్యాపీఠము | 1 | 0 |
| శ్రీకృష్ణుడు | 0 | 4 |
| మోడరన్ విద్యాప్రహసనము | 0 | 2 |
| పురూరవచక్రవర్తి కథలు | 0 | 12 |
| మహాభక్తవిజయం అను 30 భక్తుల కథలు | 1 | 4 |
| అరేబియన్ నైట్సుకథలు కంప్లీటు స్టోరీలు | 1 | 0 |
| శుకసప్తతి కథలు | 0 | 12 |
| కాశీరామేశ్వర మహిమకథలు | 1 | 8 |
| గులేబకావళి కథలు | 1 | 0 |
| మచ్చక్రవర్తుల ఇంద్రజాలపు కథలు | 0 | 12 |
| భేతాళపంచవింశతి కథలు | 0 | 12 |
| అల్లూరి సీతారామరాజు చరిత్ర | 0 | 6 |
| పన్నెండురాజుల కథలు | 1 | 0 |
| పదహారురాజుల కథలు | 1 | 0 |
| పోతులూరి వీరబ్రహ్మంగారి జీవితం | 1 | 8 |
| రెడ్డిరాజులు | 0 | 6 |

# కాంతామతి

(ఐదంకముల నాటకము)

గ్రంథకర్త:

సంపూర్ణ రామాయణము, పురూరవ, సీతాకళ్యాణము, మారుతివిజయము, మారుతీమైరావణ సంగ్రామము, జగన్మోహన, పద్మినిలోకబాంధవము, ఇత్యాది నాటక కర్తయగు.

## గూడూరు కోటీశ్వరరావుగారు.



పబ్లిషర్సు:

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి

1952



[ వెల రు 1—8—0

# ఈనాటకమునందలి ముఖ్యపాత్రలు

## పురుషులు

ప్రతాపసేనుడు—కథానాయకుడు

శాండభట్టు—ప్రతాపసేనుని గురువు

ఉత్తమశీలుడు—వైశ్యుడు

దుష్టబుద్ధి—మహాపాతకపుర రాజు

మహాపాపి, అనృతవాది—దుష్టబుద్ధి మంత్రులు

మహానీచుడు—దుష్టబుద్ధి సేవకుడు

దొంగ

1, 2 రాజకుమారులు

సేవకులు

దుర్వాసుడు—ఒక ముని

## స్త్రీలు

కాంతామతి—ప్రతాపసేనుని భార్య కథానాయిక.

కాంచనమాల—ప్రతాపసేనుని వేశ్య

రత్నమాల—వేశ్య దాసి

చంద్రరేఖ—కళింగరాజ పుత్రిక

కొందరు దాసీలు, మఱికొందరు వేశ్యలు

# పీఠిక

భారతీయ సోదరులారా!

"కాంతామతి" నాటకము మిగుల విఖ్యాతి గడించుచున్న దని వచియించుట కెంతయు సంతసించుచున్నాఁడను. ఈ నాటకము ననేక సంఘములవారు ప్రదర్శించుచుండిరి. అందు కొన్ని సంఘముల వారు "దుర్బుద్ధికిని, రాజకుమారునకును కొన్ని పద్యము లుండిన బాగుండు"నని పలుమారులు వ్రాయుచుండిరి. అందుచే వారల యీప్సిత మీడేర్చితిని.

మఱియు ప్రతాపసేనుఁడు సర్వముఁ గోల్పోయి కాంతార మున కనిపించిన నిజకాంత కాంతామతి యన్వేషణము నిదివరలో విష్కంభమున నుంచితిని. ఆయా రంగముల నిప్పుడు తృతీయాంకమున తురీయరంగముగ వ్రాసియున్నాఁడను. కాని ప్రదర్శకులా రంగమును గూడ ప్రదర్శింతురుగాక యని నాకోర్కె.

ఆంధ్రసోదరులెల్ల రిదివరలోఁ జూపిన యాదరణ జూపెదరు గాకయని యెల్లరఁ బ్రార్థించెదను.

ఇట్లు,

వేజెండ్ల — గూడూరు కోటేశ్వరరావు,

గ్రంథకర్త.

# హెచ్చరిక

శ్రీరస్తు

# కాంతామతి

## నాంది

శా. శ్రీరామామణి నెప్డు తా నురమునన్ జెన్నొందఁదాల్చిబల్
నారాజొప్పఁగ నాళికప్రముఖుల, భక్తశ్రేణిరక్షింపుచున్
క్రూరాత్మల్ గడుదుష్టదానవులని ర్మూలంబుఁగా జేయుచున్
బేరుంగాంచిన విష్ణుమూర్తి యనిశంబింపారు నైశ్వర్యముల్

[నాంద్యంతమున నటుఁడు ప్రవేశించి]

ఇంకను నటిరాకున్నదే? నటీ! యిటురమ్ము.

నటి—(ప్రవేశించి) నాథా! సెలవు?

నటు—నేఁడు నూతనముగాఁ జేయఁబడిన కాంతామతి నాటకముఁ బ్రదర్శించవలెగదా? నటకులు సిద్ధముగ నుండిరా?

నటి—సిద్ధముగనే యుండిరి. మనమును తీవ్రపడవలదు.

నటు—చెలీ! ఇంక జాగుసేయక నీ గానకళానైపుణ్యముఁ జూపి యించుకంత సంతసింపఁజేయుము.

నటి—ఏ ఋతువును గురించి వర్ణింతును?

నటు—పోనిమ్ము ఋతువులవలదులెమ్ము ఇవుడు రాఁగలకుంతల దేశాధీశుండగు ప్రతాపసేనుని యాస్థానమును వర్ణింపుము.

నటి—ఆర్యా! ఆతనికొక యాస్థానముఁగలదా? వేశ్యయగు కాంచనమాలా లోలుఁడై సర్వమును నావెలయాలికి ధారపోసిన వానికి యాస్థానమేడ? నేను వర్ణించుటేడ? ఈపండితమండలిమ్రోల వాని నుచ్చరింపదగునా? ఐన నేమనెదరు?



శ్రీ

# కాంతామతి

## ప్రథమాంకము

### ప్రథమరంగము—కాంచనమాల సౌధము.

[ప్రవేశము—కాంచనమాల కొందఱు సఖులు]

[అనుబంధము]

నేఁటికి మూఁడుదినములనుండి నావిటుఁడగు ప్రతాపసేనుఁడు రత్నమాలయింటి కేగుచుండెనని వినియుంటిని. ఐన నేమియు లేదు, అతఁడు నేనన్నఁ బ్రాణము విడుచునుగదా? నేఁడైన రాకయుండునా? వచ్చినతోడనే మాటలవ్యత్రికతిగా నాతని నిరాకరించియు, బెదరించియుఁ జూచెద. అతఁడు నాపైఁగల మోహముచేఁ జీవాట్లైనను దినును, చెప్పుదెబ్బలైనఁ దినును సందియము లేదు. ఆహా! మోహ మెంతచెడ్డది? ఎట్టి పురుషసింహునినైనను పరదాసునిగఁ జేయును గదా? ధనాధిపునినైనను సేవకునిగఁ జేయునుగదా? ఈ ప్రపంచమునఁ బురుషులన స్త్రీలచేఁ జిక్కిన కీలుబొమ్మలవంటివారు సందియము లేదు. సఖులారా! మీరిప్పుడే నందనోద్యానమునకుఁ జని విరిసిన ప్రసూనములఁ గోనితెండు. ఆలసింపకుఁడు. ప్రతాపసేనుఁడు వచ్చువేళ సమీపించినది ఇకపొండు.

సఖులు — అమ్మా! పోయిపోయి పాపగాడు వచ్చిన నెట్లుగా సంచరించెదవో? బుద్ధియమ్మా! ఇట్లా నర్తిలము పోయివత్తుము.

కాంచ — మంచిది పోయిరండు.

(సఖులు నిష్క్రమింతురు)

గీ. వలపులకుఁబట్టుకొమ్మ మా ♦ వారకాంత,
మాయలకుఁ బుట్టినిల్లు మా ♦ మానినీ యిల,
రోగములకెల్ల మూలంబు ♦ లోకులంబు
యిట్టి మమ్ములఁ జేపట్టి ♦ యేఁగఁగలరె?

మఱియు,

గీ. ధనదుని నిరాకరించెడి ♦ ధనికుఁడైన
సర్వవిద్యలు నేర్చిన ♦ సరసుఁడైన,
మూఁడురోజుల ముఱిపెంపు ♦ ముద్దుఁజూపి
సర్వమును సున్నఁజేయదే ♦ సానిపొందు.

ఇంక నేఁజెప్పఁబనిలేదు. మా వేశ్యలఁగూర్చి యిదివరకే యనేక నాటకములు జరుగుచున్నవి. ఐనను మా వేశ్యలు బహుమాయల మారులు, కపట ప్రేమధారులు, అనృతభాషులు. నేనేల? సర్వము లోకులకే దెలియు. ఇంకరూపలావణ్యములన్న మిసమిసలాడెడి మేడి పండువలె పైపసందులచేతను, కనుసైగలచేతను, తేనెపోని వేష భాషలచేతను విటులను లోఁబఱచుకొను ప్రజ్ఞ నా భగవంతుఁడు మాకులమున కొసంగెను. (లోనకుఁజూచి) ఎవ్వరో వచ్చుచున్నట్లు న్నది. ప్రతాపసేనుఁడేనా? ఆఁ! అతఁడె నేనింక కోపదృష్టి దాని వలె నిందు శయనించెద. (అని నేలపై ముసుఁగుతో శయనించును.)

[ప్రవేశము — ప్రతాపసేనుఁడు అలంకృతుఁడై]

నాముద్దులగుమ్మ, నావలపులకలికి, నామనోహారి, కాంచన మాల యేదికాన్పింపకున్నదే? కాంచనమాలా! కాంచనమాలా!

(క్రిందఁజూచి) ఓహో! వీల యిట్లు భూశయ్యపై శయనించియున్నది! కారణమేమైయుండును? నాపైఁ గోపగించి యిట్లొనర్చియుండెనా! (దగ్గరఁజేరి) కాంతా! కాంచనమాలా! (అనుబంధము 2)

కాంచ—(దిగ్గున లేచి) ఎవ్వరు నీవు? నా సౌధమునకు రాఁగత మేమి? అవలకుఁ బొమ్ము.

ప్రతా—కాంచనమాలా! ఏమిది? యిట్లు బల్కెదవు? నే ప్రతాపసేనుఁడ గానా? చూడు.

కాంచ—నీవు ప్రతాపసేనుఁడవైన నాకేమి లే పొమ్ము నేటికి మూఁడు దినములనుండి లేని కాంచనమాల నేఁడు కావలసి వచ్చినదా! చాలు నీకథయంతయు దెలిసినది.

ప్రతా—ఏమిది? ప్రేయసీ! నేఁడేమో వింతగఁ బల్కు చుంటివి?

కాంచ—ఔను! అంతయు వింతగనే యుండును. రత్నమాలతో స్నేహముఁగూడ వింతగ నుండదా?

ప్రతా—రత్నమాలయా! ఎవరు? స్నేహమెవరు చేసిరి?

కాంచ—ఎవ్వరా? నేఁటికి మూఁడు దినములనుండియు రత్నమాలా లోలుఁడవై యుండుటెఱుంగమా? పిల్లి కనుమూసి పాలుఁ ద్రావుచుండుట యెల్లవారు జూచుచునే యుందురు నాతోడ మీకు కావలసిన దేమి లే! పొమ్ము రత్నమాలయే నీ కాంత.

ప్రతా—ప్రాణప్రియా! చెప్పెద వినుము. నేఁటికి మూఁడు దినములనుండియు నీకడకు రాకుండుటచే నీకిట్టి యూహ గల్గినది. కలిగినఁ గల్గవచ్చుగాక. నా గురువుగారు వచ్చియుండుటచే నాకు రావలనుగాలేదు. ఇందులకు వేఱుగ నెంచకుము,

కాంచ—రావలనుబడని కార్యమేమి చేయుచుంటివి?

ప్రతా—కొన్ని విషయములు మాటాడవలసి ముచ్చటించు చుంటిమి.

కాంచ—ఏమి విషయములఁగూర్చి? నన్నుఁ గూర్చియేనా?

ప్రతా—కాదు, కాదు. రాజ్యాంగమునుగూర్చి ముచ్చటించుచుంటిమి. నీవిషయ మచ్చట యేలఁగావలయు?

కాంచ—నా విషయమై యేమియు ముచ్చటింప లేదా? అసత్యము.

ప్రతా—కాదుగాని, నీవిట్లుండఁ గాడిగాదు "వివాహ మొనర్చుకొను"మని పల్కినాఁడు.

కాంచ—అందులకేమని మారు బల్కితివి.

ప్రతా—నాకు వివాహ మెందుకు? వలదని పల్కితిని.

కాంచ—నిజముగ నట్లు పల్కితివా? నమ్మజాల.

ప్రతా—ప్రేయసీ! ఇంకను నాయందు నమ్మకము గల్గలేదు గదా?

చ. కలికిమిటారి! నామతిని ♦ గన్గొనవైతివి నిన్నుఁబాసి నే
నిలువఁగనేర్తునే క్షణము? ♦ నిక్కము పెండిలి యాడ నింకనిన్
గలసియు సర్వసౌఖ్యములఁ ♦ గాంచెదనంచుఁ దలంచుచుంటినో
జలజదళాయతాక్షి! నిను ♦ సౌఖ్యము స్వర్గము నీవె నాకిలన్,

రమణీమణీ! వేయేల? నిన్నుఁజూడని నిమిషమొక యుగముగనుండును, అట్టి నిన్నుఁబాసి నేఁబ్రతుకఁ గలనా?

కాంచ—ఏటికిఁ బల్కెదవు! ఇది నిక్కమా? ఒకటి తెల్పెద వినుము.

ఉ. కాముకులైనవారు తమ ♦ కార్యము దీరినయంత దాని నె
మ్మోము నుజూడకుందురను ♦ ముందటిసుద్దులు మేమెఱుంగమె!

ప్రతా—

కామిని! యేలయిట్లనెదు? ♦ కాముకులెల్లరు నట్లెజేతురా?
స్వామి యెఱుంగు నామతము ♦ భావమునందున వేఱుసేయకే.

ప్రాణేశ్వరీ! నీరూపమే నాకానందము పరమానందము బ్రహ్మానందము నీకన్న నాకెక్కుడు లోకమెయ్యది? సర్వకాల సర్వావస్థలయందు నిన్నుదక్క నన్యస్త్రీని ప్రేమించియుఁ దలంచియు నెఱుంగను ఇకముందు దలంపను ఈమాటలసత్యములు.

(తెరలో) మహారాజా? సలామ్.

ప్రతా—సేవకా! రమ్ము (ప్రవేశము సేవకుఁడు)

ప్రతా—ఏమిరా విశేషములు?

సేవకా—క్యాబినై మహారాజ్ నిన్నవచ్చివుండలేద్ ఓబుఢా బులాతాహై.

ప్రతా—నిన్న వచ్చియుండిన దెవ్వరురా? (అని ఆలోచనఁ జేయును)

సేవ—తెల్సిందినై మహారాజ్. మోటాకిడీ పకడ్కే ఆయా నై బుఢా ఉస్ ఆయా జరూర్సే ఆవ్ ఉఠో.

ప్రతా—నాకొరకై ఇప్పుడు వచ్చువారెవరు? సేవకా! ఎవ్వరు తెలియకుండఁ జెప్పెదవు.

సేవ—మాలుంనై క్యా అది అది కాండ కాండ క్యాకి ఆతానై హాంకు కల్ ఆయానై బుఢా ఉను ఆయా అబ్ మాలుంహై

ప్రతా—ఓహో! గురువుగారు కొండబట్టుగారా?

సేవ—ఆఁ! ఉస్ గురు కొండభట్టు.

కాంచ—సేవకా! గురువైననేమి లావా? ఇప్పుడు వచ్చుటకు వలచు కాదని తెల్పుము పొమ్ము.

సేవ—ఠైరో తుంకు బులాయునై క్యామహారాజ్! ఆతానై?

ప్రతా—సేవకా! నేనిదేవచ్చెద నీవు పోయి వానికి వలయు సామగ్రులనిచ్చి నానిలయమందే యుండునట్లు జేయుము.

సేవ—అచ్ఛా! (తనలో) కాంచనమాలా సైతాన్ వైసాకరే! అబ్ హాం క్యాదిస్తా? ముందువుండది ముసళ్ళపండగ అబ్ క్యాహై.

(అని నిష్క్రమించును)

ప్రతా—మనోహారి! కొండభట్టుగారు వచ్చియుండిరి, నేనింక వారిదర్శింపఁబోవలెను శెలవా ? ఇప్పుడే వచ్చెదను ?

కాంచ—ఏమి గురువు నాకన్న నెక్కుడగునా ?

ప్రతా—ఎక్కుడైనగాకున్న కులగురువుగదా ? దర్శింపకుండు టెట్లు ?

కాంచ—నీ విప్పుడు పోవలదు.

ప్రతా—పోయినదేమి? నిమిషములో వచ్చెదను. ఏమందువు?

కాంచ—అట్లయిన నేను రెండుసంగతులఁగోరెద నని యిచ్చె దనని యానఁబెట్టి పొమ్ము.

ప్రతా—నీకేవేళనైన నడ్డుచెప్పియుంటినా ? సర్వవ్యవహారములయందును నిన్నే ప్రధానమానిసిగ నెంచితినే?

కాంచ—రెండవది నీరాజ్యములోని సర్వాధికారము నాకిమ్ము

ప్రతా—అట్లనే యొసంగితిఁ గైకొనుము ?

కాంచ—నీవ్రేలియుంగర మిట్టిమ్ము.

ప్రతా—ఇదిగోఁ గైకొనుము. (అని యిచ్చును)

కాంచ—అప్పుడే అయినదా? నీకు నేను రాజును. నాయాజ్ఞ మీరక నీవు నడచుకొనవలయును. ఇందులకు సమ్మతింతువా ?

ప్రతా—ప్రాణప్రియా! నీయాజ్ఞకు మారుబల్కుదునా ? నీ వెట్లొనర్చుమన్న నట్లనే యాచరించెద సందియము లేదు. సెలవా ?

కాంచ—నేఁ జెప్పినది మఱచెదవా ?

ప్రతా—ఏమది ?

కాంచ—వివాహము వలదని

ప్రతా—నీయాజ్ఞోల్లంఘన మొనర్చి వివాహ మొనర్చు కొందునా? వివాహ మొనర్చుకొన్నను నింతకన్న సౌఖ్యముఁగలదా!

[ప్రవేశము—సేవకుఁడు]

సేవ—మహారాజ్! సలామ్.

ప్రతా—ఏమిరా! మరల వచ్చితివి

సేవ—ఉన్ బులాతా హై మహారాజ్!

కాంచ సేవకా అయిన ఎందులకు వచ్చినాడు?

సేవ—హాంకు క్యామాలుం ఆయాతో ఆతా సహితో నైహి ఫిర్ జాకో బుధాకు అంతా సెప్తాం, హామార ఖజానా క్యాజాతే?

ప్రతా—సేవకా! రమ్ము పోదము. (నిష్క్రమింతురు)

కాంచ—(ఒకవైపునకు నిష్క్రమించును)

సేవ—కాంచనమాలా మాటాల్కి యిని ఖజానాఅంతా ఖరుసుపెట్టి ఖేల్తాహై అబ్ మాలుం ఇంతయింత పెద్దరాజుల్కి నూసి ఉండాలేదు? మాయామాటల్ సెప్తె మాకి తెల్వాదు ఏం అంకు క్యా దస్‌రూపీ దర్మెవాలాకు బఖాయిశారిణ్కి ఎందుక్కి కాంచన్‌మాలా అయ్యగార్కి బుట్టలో పెట్టింది. హాంకూసాబ్బిమాలుంకాంచనమాలా మీారు దుమ్ముపడ ఉన్‌ఘర్కు అకోజాకో బులానేకో మర్‌తుంరేహై మారాజు యింక ఉంటాడుఏం కాంచన్‌మాలాయేసిన ఢంకావలాన్ రాజు కొంప ఖలాస్. (నిష్క్రమించును)

ద్వితీయరంగము—ప్రతాపసేనుని యాస్థానము

[ప్రవేశము—ప్రతాపసేనుఁడు, కొండభట్టు]

ప్రతా—ఆచార్యా! ఏల మీాకీపట్టుదల? మీారెన్ని చెప్పినను నామనమున కెక్కవు ఎందుకిట్టు బోధించెదరు!?

కొండ—ప్రతాపసేనా! వేశ్యకాంత నీకు శాశ్వతమా? సరివారు విన్న నగుబాటుగాదా? కులమైన కపకీర్తిరాదా? యశంబు పోదా? వివాహాం బొనర్చుకొమ్మని నిక్కచ్చిగఁ బల్కుటవాదా? ఛాలుఛాలు వివాహాం బొనర్చుకొనుము (అనుబంధము)

ప్రతా—గురువరా! వేశ్య నుంచుకొనుటతప్పా? పుడమిపై నెందఱు వేశ్యాలోలురై యుండలేరు? నీవుమాత్రము నంగనాచివా?

చ. తలదాను గడ్డమున్నరసి ♦ తాపసిరీతిగ నేటికుంటి వీ
జలజదళాక్షులన్ గలసి ♦ సౌఖ్యగతిన్ జరియించలేదె? నీ
తులఁదఁబల్కనచ్చోకరి ♦ తోఁ దమదమ్ముఁగాఁ గాదుగాదె నా
బాలఁతిని గాంచనామణిని ♦ బొందిసుఖింపగ నోర్వవైతివా?

చాలుచాలు యిట్టి ప్రసంగములు నాకు జెప్పకుఁడు. నే విను వాఁడగాను.

కొండ—(తనలో) ఓహో! తొండముదిరి యూసరవిల్లియైనదే నేను నీతులుదెల్ప నన్నే నిరాకరించుచున్నవాఁడు. ఇంక నితరులు దెల్పిన నీతఁడు వినునా? (ప్ర) ప్రతాపసేనా! శాంతింపు. ఇంక నొక్కటి దెల్పెద మనమున యోజించుకొనుము.

ఆ. వారకాంతఁగూడ ♦ వైభవంబేనని
దలఁచుచుంటి వీవు ♦ ధరణిలోన
అపయశంబు గల్గు ♦ నని యింతవరకును
బొడమదయ్యె నీకు ♦ బుద్ధిలోన.

ప్రతా—అయ్యా! వినుఁడు ఆకాంచనమాల మాటయే నాకు వేదంబు దానియాజ్ఞయే నాకుజీవనము. గాన దానియనుమతి లేక వివాహంబొనర్చుకొనఁ జాలను క్షమింపుడు.

కొండ—ఓయీ పిచ్చివాఁడా! వేశ్యమాటవిని వివాహం బొనర్చుకొనని వెఱ్ఱివాఁడీలోకమునఁ గలఁడా? వివాహం బొనర్చుకొనినఁ గదా పుత్రపౌత్రాదులు గల్గుట? దానివలనఁగదా వంశాభివృద్ధి? దానివలననేగదా సర్వసౌఖ్యములు? దాని వలనగదా యశశ్చంద్రిక నలుదిక్కులఁ బ్రకాశించును? నీసరి రాజులువిన్న నీయెడ గౌరవముండునా? ప్రజలకు భక్తియుండునా? జన్మంబున మానాభిమానంబు లుండవలదా? కీర్త్యపకీర్తులు దలంచవలదా?

ప్రతాప—గురువరా!

ఉ. మానముపోవుఁగాక, యిఁక ♦ మానధనంబుమఁగిటుఁగాక, నా
ప్రాణముపోవుఁగాక, మరి ♦ ప్రాభవమంతయు వీడుఁగాక, నా
భానుఁడు త్రోవఁబోకహీనపు ♦ భానుఁడు వేడిమిఁబాసుఁగాక, నా
మానినిపొందువీడు టను ♦ మాట నసత్యము సేయుయేటికిన్.

కాంచనమాలతో నేనిఁక వివాహమాడనని బాసయొనర్చిన నేనెట్లుగా వివాహమాడుదును? మఱియు, కాంచనమాల యెట్లు జెప్పిన యట్లువినవలసి యున్నది కాని అన్యథా చరించవలను బడదు. నన్ను మీరింక నిర్బంధించకుఁడు.

కొండ—ప్రతాపసేనా! క్రిందుమీఁదెఱుంగకఁ జరించెదవా! పిన్న పెద్దలని గుర్తెఱుంగక సంచరించువానికి గౌరవముండునా? గురువునకు నాయాజ్ఞఁగూడ నిరాకరించెదవా? నీ మేలుకొరకై యింతగాఁ జెప్పుచుంటినిగాని, వినకున్న నెవఁడుజెప్పెడు? నీకన్న ధనాధిపులే వేశ్యాలోలురై నిలువనీడ లేకయు, గుడువఁగూడు లేకయుఁ తుదకు సన్యాసులై జెరలాడుచుండిరి. కామాంధకారము కన్నుల గప్పుటచే నేమియుఁదెలియక వెలకాంతమాయకులోనై పల్కుచుంటివి. ఇప్పటికైనను తెలివి తెచ్చుకొనుము. ప్రతాపసేనా! ఈ రహస్యము వినుము.

గీ. వారకాంతల వలలందుఁ ♦ బడెడివారు
మఱలఁ గోల్కొందురన వట్టి ♦ మాటె, కాక
వంశ మర్యాదలకు నెందుఁ ♦ బనికిరాక
పశువనెడి పేరుతోఁబిల్వఁ ♦ బడెడిధాత్రి.

అను నార్యోక్తి నించుకంత మనమునఁ దలపోయుము.

ప్రతా—ఆచార్యా! మీపట్టుదల విడువరా?

కొండ—గురువునకు నాయాజ్ఞమీఱి చరించెదవా!

ప్రతా—సుందరా! ఏమిసేయుదును నెదరు? కాంచనమాలను విడఁజాల.

కౌండ—పోనీ. విడకున్న నుసరియె వివాహమొనర్చుకొనుము.

ప్రతా—అటులయిన నంగీకరించెద.

కౌండ—మంచిది సంతోషమైనది.

ప్రతా—కాని, వివాహమునకు మాత్రము నేను రాను.

కౌండ—నీవు రాకున్న యింక వివాహ మెవ్వరికొనర్పవలయు?

ప్రతా—ఈ ఖడ్గమునకు.

కౌండ—ఇట్లొనర్చిన జగము మెచ్చునా?

ప్రతా—మెచ్చిననేమి మెచ్చకున్న నేమి? నాకుఁ దడవగుచున్నది ఇదె వెళ్ళెద (అని పోఁబోవ కౌండభట్టు అడ్డగించి)

కౌండ—వతా! ప్రతాపసేనా! ఏమి చెప్పితివి?

ప్రతా—చెప్పినదియే వు సర్వమైన కీఖడ్గమే.

కౌండ—మంచిది. అట్లనేయొనర్చెద.

ప్రతా—ఆచార్యా! మీరు పయనముగుండు మంత్రిచే ఖడ్గమును బంపెద. (నిష్క్రమించును)

కౌండ—ఔరా! ఏమీ వేశ్యలమాయ? ఎమియు నెఱుంగని యీ ప్రతాపసేనుని యెంత కామాతురునిఁగా జేసెను? ఔను స్త్రీల వలనగదా లోకమంతయు మోసపోవుట? అందు వారాంగనయన్న వేఱుగ జెప్పవలయునా?

గీ. దర్శనముఁజేయ నెమ్మది ♦ తత్తరిల్లు
స్పర్శనమ్మున సంపదల్ ♦ సమసిపోవుఁ
గాన వేశ్యలతో పొందు ♦ మానుఁడనుచు
వేడుచుంటిని యువకుల ♦ వేయిగతుల.

(నిష్క్రమించును, యవనిక జారును)

ద్వితీయరంగము : కాంచనమాల సౌధము

[ప్రవేశము : ప్రతాపసేనుఁడు, కాంచనమాల]

కాంచ—ప్రాణేశ్వరా! నన్నుంచి మోసముఁ జేసితివే ?

ప్రతా—నీ కేమియు లోటులేదు. భీతిజెందకుము. ప్రేయసీ! నాకు నీయెడఁగల సంతసమునకు మితిలేకయుండునుగదా ? లభించిన వారాంగనలపొందే లభింపవలెను.

కాంచ—నాథా! నృత్యగానములచే కొంతకాలము గడుపుదునా ?

ప్రతా—నీయిష్టమగున ట్లొనర్పుము.

కాంచ—రత్నమాలా! ఏమిచేయుచుంటివి ?

(తెరలో) ఏమియు లేదు.

కాంచ—మీరెల్లరు నలంకృతలై శీఘ్రముగ రండు.

[ప్రవేశము కొందఱు వేశ్యలు అలంకృతలై యిరువైపులనుండి]

కాంచ—సఖులారా! నేడు మీ రావగా రానందించునట్లు నృత్యగానాదు లొనర్పవలయు

వేశ్య—(అట్లు జేయుచు)

(అనుబంధము 4)

ప్రతా—(సంతసమున)

చ. కలికిమిటారి! వహ్వరె! చో ♦ కాటపు నాటల పాటలన్ సుధన్
జిలికితో, తద్రసంబునకు ♦ శేముషి సంతసవార్ధిఁ దేలె నీ
యిలఁగల మోహములం జివురు ♦ లెట్లువహించెనో చూడుమీ సభా
స్థలి జనులెల్ల ఱాళిలల ♦ చందముగాఁ గనుపట్టిరి త్తరిన్.

(దగ్గరకుఁ జేర్చుకొని ముద్దిడుకొని) ప్రియకాంతా! నిక్కముగ నీ వమరలోకమున దేవవేశ్యవై జనింపవలసినదానవు. నా పూర్వపుణ్య పాకముచే నన్నుద్ధరించ నీలోకమున జన్మించితివి. ఆహా! నేనెంత కృతార్థుఁడ? ఎంతధన్యుఁడ? ఎంతపుణ్యుఁడ? నాకు

జనించు నానందమునకు నీవుగదా మూలంబవు? ప్రియా! నాయా నందమును భరింపఁజాల. సఖులారా! మీ రింక పొందు మీ కీ వలయు పారితోషికము లొసంగెద

(వేశ్యలు క్రమముగా నృత్యముఁ జేయుచునే నిష్క్రమింతురు)

కాంచ—ప్రాణప్రియా! నృత్యగీతాదులైన రుచించినవా?

ప్రతా—రుచించినవాయని పల్కనేల? రుచించుటయేగాదు అందలి రసమును గ్రోలితిని. ద్రాక్షామరంద దేక్షుఖండశర్కరలకన్న నెక్కుడు రుచ్యమై మనమున కానందమొసగెను. గాని యింక మనము లోనికి పోవుదము రమ్ము. (నిష్క్రమింతురు)

[ప్రవేశము సేవకుఁడు, కాంతామతి చిత్రపటముతో]

మహారాజ్ అందర్ కు ఆనా?

(తెరలో) ఎవఁడురా! అచటనే యుండుము.

[ప్రవేశము కాంచనమాల]

ఓరీ! నీ కేమియు పనిపాటలు లేవా? ఏమి వచ్చితివి? శీఘ్రముగఁ దెల్పుము.

సేవ—అరె మహారాజ్ కు బులావ్. జా తుంకుబులాయానై

కాంచ—ఓరీ! మీ రాజెవరో ఎఱుంగుదువా? నేనే

సేవ—కాంతామతి అమ్మోరు ఆయంక నే బోల్ జా.

కాంచ—సేవకా! కాంతామతి యెవ్వరు? ఆ చిత్రపటమామెదేనా? ఏదీ చూతము.

సేవ—మహారాజ్ జోరు. మాలుంనైక్యా (తనలో) తుమారే మామే మాటపడే లేవ్. ఏదేఖో అమ్మోరు (చిత్రపటమిచ్చును)

కాంచ—(తనలో) ఆహా! ఏమి యీమె యందచందములు! భువనమోహినియన నీమెకే చెల్లును. ఇతఁడు యీమె సుందరవదనారవిందముఁ దిలకించిన యింక నాపై భ్రాంతిపడునా! అక్కటా!

నాగతి యెట్లయ్యెడి? (ప్రకాశముగా) సేవకా! నేను దెబ్బెదనులే పొమ్ము.

సేవ—ఎక్కడఁబోవాలేం బాబోబాబోయ్ నైతే అందరూ మొజాతా.

కాంచ—సేవకా! నీవిచ్చటనే యుండుము. (పటమునుజూచి) ఔరా! ఏమి యీయామె యాకృతి? ఈ పటమీయతనికిఁ జూపిన నాకు శుభము గల్గదు. ఈపటమున గల కాంతామతి నేత్రమునకు నున్నపు చుక్కనిడి కులాపినిగఁజేసి చూపి" ఆడక యాడక నంధురాలిని బెండ్లియాడితివా!" యని హేళనజేసెదఁగాక

[నిష్క్రమించి, ప్రతాపసేనునితో పునఃప్రవేశము]

ప్రతా—ఔరా! గురుడెంత క్రూరచిత్తుఁడు!

గీ. వలదు వలదన్న కృత్రిమ ♦ వాక్యములను
నాడి, యిటుజేసె గురుఁడిదే ♦ యంధురాలి
నేమిజేసినఁ గసిదీరు ♦ విప్రుడతని
క్రూరచిత్తుండు! మూర్ఖుఁడు! గురుఁడువాఁడె.

ప్రియకాంతా! వాని నేమి చేయుమనెదవు? వలదన్న బలిమిని పెండిలిఁజేసినాఁడు చేసెనుపో అంధురాలినా జేయుట? ఈ యంధురాలిని గురువును ఏమి సేయుమనెదవు?

కాంచ—ఏమియు వలదు లెండు శాంతించుఁడు.

ప్రతా—శాంతి! ఎక్కడిదా శాంతి!

కాంచ—పోనిండు. కాంతామతి గాచబిడ్డగుటచే నామెను గౌరవముగ కారాగృహమందుంచుఁడు. గురువగు కొండభట్టునకు ముండనముఁగావించి ఖరముపై నెక్కించి యుత్సవముఁజేసి, దేశభ్రష్టునిగఁ జేయుఁడు.

ప్రతా—మంచిది సేవకా! సత్వరమజని కాంతామతిని కారాగృహముందుంచుము గురుని దేశభ్రష్టునింజేయుము! పొమ్ము.

సేవ—మహారాజ్! మాకి తెల్సిందిలేదు.

కాంచ—ఏమి తెలియలేదా? కాంతామతిని మొదట కోట్లో బెట్టుమని చెప్పినారు. పిమ్మట గురువును తలగొరిగించి గాడిదపై నెక్కించి యూరేగించి వెళ్ళఁగొట్టుమని చెప్పినారు. ఇప్పుడు తెలిసినదా?

సేవ—ఆఁ (తలయూపుచు) మాకిప్పుడు తెలుస్తాదియేం? ముందుండది మనుళ్ళపండ్గ అబ్ క్యాహై మహారాజ్! క్యాహుకుం?

ప్రతా—ఏమిరా! కాంచనమాల చెప్పలేదా? అట్లే యొనర్చుము.

(అని యిరువురు లోనకుఁ బోదురు)

సేవ—కాంతామతి అమ్మోరుడ్కి భోత్ కుషిఆయా హాయ్ అలా! కాంచన్మాలా సైతాన్ కాంసీ ఆయారే? మహారాజ్ హుకుం జెయ్యాలవొద్దు మల్లీమేం కాంచన్మాలా మాటల్కియిని పెళ్ళాం గుడ్డిదిఅంటూ సెప్తాడ్ కాంతామతి అమ్మోరుడు కాల్కింది మట్టి వస్తుందియేం బడాబద్మాష్ వుండింది.

(నిష్క్రమించును) (యవనిక జారును)

---



శ్రీరస్తు

# కాంతామతి

## ద్వితీయాంకము

### ప్రథమరంగము — కారాగృహము

[ప్రవేశము — కాంతామతి కారాగృహములో]

(అనుబంధము [illegible])

హా! దైవమా! నే నేమి యపరాధ మొనర్చితిని? నన్నిట్టి కారాగృహమందు నిర్బంధింప నేల? పరిణయమైనదాది నేఁటివరకును నామోమైనఁ జూడలేదే! పోనిమ్ము నాథా! నేనపరాధినైన పుట్టినింటికి బంపరాదా? లేకున్న నేఁడైన వేఁడుగఁ బంచరాదా? తామొనర్చు కార్యముల కేమైన నడ్డుకొంటినా? వేశ్యాలోలురై, అగ్నిసాక్షిగ వివాహమాడిన నన్నుఁ గన్నులనైనఁ జూడక నిష్కారణముగ కఠిన శిక్ష విధించితిరే! అయ్యో! నేనెంత పాపురాలను? ఓ కాంచనమాలా! నీవెంత పూజ్యురాలవు! నీకైన నాయెడ దయరాదా? అయ్యో! ప్రాణకాంతుఁడే యిట్టి ఘోరకార్యమునకుఁ బాల్పడ, వేశ్యాంగనవగు నీకుమాత్ర మేల కనికరముఁ గల్గును? అక్కటా! పూజ్యుండును, పితృసమానుండును, కులగురువును నగు కొండభట్టుగారికినిగూడ నెట్టిచెట్ట సంభవించినది? అయ్యో! నాగ్రహచారమా

సీ. వెలకాంత నటుగూడ ♦ కులకాంత నిటువీడ
భావ్యమై దోచెనా? ♦ వసుమతీశ!

కులగౌరవంబెల్లఁ ♦ బలుచనౌనంచును
మదిలోఁ దలఁపవా? ♦ మనుజనాథ!
పాటివారలువిన్నఁ ♦ జౌకఁ జూతురటంచుఁ
దలపోయకుంటివా? ♦ ధన్యమూర్తి!
బంధుమిత్రులనోటఁ ♦ బాటించవైతి వ
య్యకృతిగాక తప్పగా ♦ నరసితయ్య!
గీ. ఏమి యపరాధ మొనరించి ♦ తిప్పుడేను
మదికి సుంతైన; దోఁచదో ♦ మాన్యచరిత!
తప్పులున్నను మన్నించఁ ♦ దగును నన్ను
రక్షణముఁ జేయవేఁడెద ♦ రాజమౌళి!

అయ్యో! కొద్దినోములు నోచి యెక్కుడు ధనమురమ్మన్న వచ్చునా? నావంటి పాపురాలు బ్రతికి పుట్టినింటికి మెట్టినింటికిని నప యశముఁ దెచ్చుటకన్నఁ జచ్చుట మేలుగదా? హా! ప్రాణప్రియా! ప్రతాపసేన రాజేంద్రా! నన్నేల యిట్లు నిర్బంధించెదవు? నాకడ నేర మున్న మీఖడ్గముచేఁ బ్రమించరాదా? మీకు సౌఖ్యమును, నాకు స్వర్గమును గల్గుఁగదా?

[ప్రవేశము—సేవకుడు]

అమ్మాడ్ భోత్ రోతీహై తో క్యాకర్నా? మహారాజ్ వాలుకుం అమ్మా! క్యాకర్తె, కైకు రోతె గోసకో ఇది ఘూచారం.

కాంతా—సేవకా! నేనేమి యపరాధ మొనరించితిని? అన్నా! నీవాకాంచనమాలకడకేగి యిట్లు బల్కుము. "అమ్మా! కాంచన మాలా! నాయెడ దయయుంచి ప్రాణేశ్వరునకుఁజెప్పి నానిర్బంధ విమోచనముఁ గావింపుము తల్లీ! నీకు నేను సేవకావృత్తిఁ జేసెద. నీమేలు మరువఁజాల. నాయాభరణములన్నియు నొసంగెద" నని దెల్పుము పిమ్మట నామె దయ.

సేవ—అమ్మా! వైసా బోలేతో మహారాజ్ ఫిర్ క్యాదం డన సెప్తాదో, మైజాతా నై సలామ్‌కర్త.

కాంతా—అమ్మా! నీచంద్రహారకే మొసంగెద మహారాజు వినకుండఁగ రహస్యముగ నా కాంచనమాలతో "నిగుల దుఃఖించుచునిట్లుఁబల్కెనని" చెప్పుము. నీకుఁ బుణ్యముండును.

సేవ—కంచన్ ఫిర్ ఓబాతాసుంతా సునో ఫిర్ మహారాజ్‌కు బోల్తానై? పిచ్చిఅమ్మా ఎక్కడమాటల్ సెప్తావు. కాంచన్ మాలాఅంటే నీకీ తెల్వాదు కొంపల్ మింగియేస్తాని.

కాంతా—అమ్మా! అయినఁ బోయిరమ్ము నా ప్రాప్తమెట్లుండునో? ఇదిగో! చంద్రహారముఁ గైకొనుము. (అనియిచ్చును)

సేవ—(హారముఁ దీసికొని) అచ్ఛాజాతేలేవ్ అమ్మా! (పోవుచు) మంచిహారం మాకీచిక్కిందిఅండీ ఇట్టాసిక్కాల మాకీ లేక పోతె పదిరూపాల్ జీతంమీద పెళ్ళామిక్క బిడ్డల్‌కి ఎట్టా బతికిచ్చాల మళ్ళీమేం, (నిష్క్రమించును)

కాంతా—అయ్యో! దైవమా! తుదకు నాగతియెట్లయినది? నాప్రాణకాంతునిఁ గనులారఁ గని యెఱుఁగకుండఁగనే యున్ని యుఁగ చాట్లఁ బెట్టితివా! హా! నేనెంత పాపురాలను?

సీ. పతిరూపమునుజూచి ♦ యతిసమ్మదంబుతో
నుండెడి భాగ్యంబు ♦ పండదయ్యె
కాంతు సేవలొనర్చి ♦ ఘనయశంబుండెడి
పున్నమునాకింకఁ ♦ బుట్టదయ్యె
నాథుని చెంగట ♦ నాముచ్చటల్ దీరఁ
గోరినకోర్కె చే ♦ కూడదయ్యె
ప్రియుని ముఖముఁజూచి ♦ ప్రీతినుండఁగఁ జాలు
నంత యదృష్టంబు ♦ సమరదయ్యె,

గీ. అక్కటా! యెట్టిపాపినో ♦ యెంతకష్టకాలిల
నందునుంటిని నా దుర్దశ ♦ నెవ్వరికి దెలుపుదు
మిమ్మునంగ జెలసియున్న! నా ♦ ప్రాణనాథు దేవుఁ
డిట్లు నాకోర్కె దీరెనన ♦ కెట్లుగడతు.

అక్కటా! నాలుగునాళ్లుకే ఎట్టి కష్టములఁ జేసితివి. లెక్కలేని సఖీ జనంబులఁగలసి సంతోషముగ నుండు నే నీకారాగృహమున దేనికై నిద్రాహారంబులు లేక దుఃఖింపవలసెనే? హా! నాథా!

( మూర్ఛిల్లును, యవనిక జారును )

ద్వితీయరంగము—కాంచనమాల సౌధము

[ ప్రవేశము—కాంచనమాల, ప్రతాపసేనుడు శయనించి ]

( అనుబంధము 6 )

కాంచ—ప్రతాపసేనుఁడు కీల్బొమ్మవలె నాచేఁజిక్కినాఁడు. ఈ రాజ్యమునందును, తనయందును, తన యింటియందును వేయేల? సర్వ వ్యవహారములందును సర్వాధికారములఁబొంది యీతని నొక సన్యాసిగఁజేసి కూర్చుండబెట్టితిని ఇంక నాకేమికొఱత? ఈతని ధన మంతయు లాగి నిలువఁజేసితిని. ఈ ధనముచే నా సంతతివారు పది తరములవఱకు వెచ్చబెట్టినను తఱుగదు. ఆహా! ధనముగడించు మార్గమున వేశ్యలదే కదా?

చ. విటులఁ గృహంబుఁ జేర్చుకొని ♦ వేయివిధంబుల వేషభాష లం
పటులను జేసి పైఁబడి ♦ భ్రమల్ గనఁజేసి ధనంబు సర్వమున్
జిటికలోలాగి నిర్ధనిని ♦ నింటగఁ జేసియు దుత్తయొక్కటిన్
దిటవుగఁ జేతికిచ్చిమఱి ♦ ద్రిప్పుటజూడరె? వేశ్యకాంతలున్.

వేశ్యకాంతలఁగూడి బాగుపడిన వాఁడీలోకములో నెవ్వఁ డుండెను! మాన్యమ్ములమ్మియు, వెలకాంతలకుఁబెట్టి యొందఱు సన్యాసులుగా లేదు!

[ ప్రవేశము సేవకుడు ]

కీర్తన

"దోసుకు నేదానా, నీకిదోసం కటే వాంగనాజా,
దైవకటాక్షం తర్లిపోతాది, ధనంపానీకావకానా"

మహారాజ్! యెక్కడవుంది? (మానికిపాస్క బగబోవును.)

కాంచ—ఓరీ! ఏమిమాటాడినవి తప్పు పైఁబడఁజెప్పెదవు?

సేవ—పైలే బోలో.

కాంచ—ఓరీ! రాజుతో నిప్పుడేమి పనిగల్గినది?

సేవ—సునో కాంతామతి అమ్మోవుడ్ భాత్ కష్టంలోవుంది. జైల్ మెరోతేహై నీకిప్రార్థించి "జైల్కి నాకి యిడుపిచ్చు అమ్మా! నీకీ కాల్కి మొక్కుతా" అని యేడుస్తావుంది. మహారాజుకి జబ్బర్ లోజ పాపం.

కాంచ—కాంతామతి తన ప్రాణేశ్వరునకుఁజెప్పు నిర్బంధము నుండి తప్పించుమని ప్రార్థించినదా? కల్ల నమ్మజాల.

సేవ—నై అమ్మా! అంతాసత్తెం. నీతోడు మట్టితోడుబోలు జా రోతేఅమ్మ.

కాంచ—సేవకా! నేనిదివరకే జెప్పియుంటిసి, నామాట వినడయ్యె నేమిచేయుదును! అనేకవిధాల బ్రతిమాలిగూడ జెప్పితిని.

సేవ—తుమారే బాతాఁసుంతానై సంగనాచి మర్యా! బోలోజా.

కాంచ—ఐన మరలఁజెప్పెద నీవిచ్చటనే యుండుము.

సేవ—అచ్ఛా జావ్. (ఒకచెంతకేగి నిలిచియుండును)

కాంచ—(ప్రతాపసేనుని లేపి) ప్రాణేశ్వరా! వింటిరా? దుర్మార్గురాలగు కాంతామతి మిమ్మును నన్నును మిగుల వాడిపోయుచున్నదట. మీకు భార్యయగుటచే మిమ్మాడిపోసినఁ బోయుగాక, నన్నేల నాడిపోయవలయు! నాకును దానికిని యేమి సంబంధమున్న

డని ? నీ భార్యచేఁ దిట్టించుచుగా నన్నుఁ జేరదీసితివి ? హా ప్రాణేశ్వరా! నేనింక జీవింపజాల. ప్రాణములఁ బాయుఁదాన నాకింక సెల వొసంగుఁడు. ( అని యేడ్చుచు ) నాథా ? ఇంక నన్నువీడి నీభార్యనే గూడియుండుము. నాకును నీకును నేఁటితో ఋణము దీరినది.

ప్రతా—ప్రియకాంతా! దుఃఖపడకుము. (కంటినీరుఁ దుడుచును.) ఐన దాని నిప్పుడేమి సేయుమందువు ?

కాంచ—(కోపముతో ) ఏమిచేసెదరో నేనెఱుఁగను. కనికరించి విషమిచ్చినను సరే. లేక నానన్నుఁ గాలబెట్టినను సరే ఇంక నన్నడుగకుఁడు. (పెడముఖముఁ బెట్టును)

ప్రతా—ప్రేయసీ! ఈవంతయు నీకెవ్వరు తెల్పిరి ?

కాంచ—ఎవ్వరో యేల ? సేవకుఁడే ఇందేయున్నవాఁడు వలయు[illegible] సర్వముఁ బల్కించెద. పలతునా వాని ?

ప్రతా—నిజముఁ దెలిసికొనవలయు రమ్ము.

కాంచ—వినుఁడు మీ రేమియు మాటలాడవలదు. సర్వము వానిచేఁ జెప్పించెద. మీరు నూరుఁబల్కిన కార్యముచెడును. మీ యెడల భీతిచే వాఁడు తారుమారుగాఁ గలఁడు. మీ రూరకొన వలయు [illegible]దీల కంగీకరించెదరా ?

ప్రతా—అంగీకరింపకేమి, నీమాట మీరుదునా ?

కాంచ—అట్లైన రండు (ఇరువురు ముందునకువచ్చి)

కాంచ—సేవకా! ఇటురమ్ము. కాంతామతి కారాగృహ మందుండి యేడుద్చుచుండుటలేదా ?

సేవ—నిజం నిజం,

కాంచ—నీవు నాతోడఁ జెప్పినమాటలెల్ల ఆవిడ పల్కినదా లేదా ? సత్యముఁ జెప్పుము.

సేవ—మాకి అబద్ధం సెప్పాలఅని పాణంమీదవచ్చిందియేం.

కాంచ—ప్రాణేశ్వరా! ప్రత్యక్షముగ వింటిరిగదా? పైన మీ యిష్టము.

ప్రతా—సేవకా! ఇంతేయు నిజమా?

కాంచ—(ప్రతాపరావుని చాటునకుంబోయి చెవ్వులో సేవకునికి సైగజేయును.)

సేవ—ఓ బాతా సాబ్ని వచ్చేమహారాజ్ మా గడ్డన తోడు

ప్ర—అట్లయిన యీ దుశ్చారిణి వరణ్యముల పంపజేసి. రమ్ము. ప్రాణేశ్వరీ! రమ్ము (అని లోనికి బోవును)

కాంచ—(పోవుచు ఇప్పటికి నా కోర్కె దీరినది. తనలకును దనభార్య మోహము జూడక నేను జెప్పినట్లు జరించుచు న్నాడు. నిజముగ నీతడు భార్యనుజూచి యున్నచో నన్ను గౌరవించునా? అందులకే నేనిట్టి పన్నుగడ బన్నినది. నేనాతని హృదయక్షేత్రమందు మా గూరాబీజము నాటుచు నేయుంటిని. నేనాటిన బీజమెల్ల నంకురించి వృద్ధినొందుచునే యున్నది. ఇదియు జక్కగ వృద్ధిబొందినది. వేశ్యల మర్మములు దెలియ నెవ్వరితరంబు? అరచేత వైకుంఠము జూపు టెఱుంగరో?

(నిష్క్రమించును యవనిక జారును)

సేవ—హాయ్ హాయ్. యెంతగాయలుసేసి మసిపూసి పోయింది రాజు అచ్ఛాఆద్మిహైతో వైసాభీత్తే? కంచిన కైసాబోలేతో వైసా సుంతేవున్ క్యాకరేగా రాజ అబ్ క్యాహై? ముందు వుంది ముసళ్ళపండ్గ. (నిష్క్రమించును)

## తృతీయరంగము—అడవి

[ప్రవేశము—కాంతామతి]

(అనుబంధము 7)

అయ్యో! తొట్టతుదకు నాగతి యెటులయ్యె? నాకిట్టిచో సంభవించునని కలనైనం దలంచనే? మహారాట్కుల సంజాతనై, రాజాధి

రాజ సార్వభౌముఁడగు ప్రతాపసేన రాజేంద్రునకు రాణినై. రాణి వాస ముండుటకు మారు వనవాసమాయెనే! హా! హతవిధీ! హా! ప్రాణకాంతా! ప్రతాపసేన రాజేంద్రా!

సీ. వేశ్యానాయకుఁడక్క ♦ విటకాండ్రతో గూడు
బుద్ధి మీ కెవ్విధిఁ ♦ బుట్టెనయ్య!
పుట్టెఁబో కుమాట ♦ పట్టువిడియు మీర
లరయ కేటికిఁ బెండ్లి ♦ యాడిరయ్య!
పెండ్లియాడినదాదిఁ ♦ బ్రేమ నన్ జూడక
నెడఁబాసియుంట మీ ♦ కేలనయ్య!
యెడబాసినను సరే ♦ పడరానిపాట్లకై
వనభూములకుఁ బంపఁ ♦ బాడియయ్య!
గీ. పాడియైనను హర్షమౌ ♦ భాగధేయ
నిందమీదికి తగదని ♦ గుందుచుంటి
వేశ్యమాటల విననేల? ♦ వెత లివేల
మీకు నాసిని తలఁదీయ ♦ మేలుగాదె.

హా! దైవమా! నాకింక పతి సుందరవదనారవిందముఁ జూచు భాగ్యమబ్బునా? అదియే కల్ల.

సేవ—అమ్మా! రోనకో కైకురోతే. కాంచన్ మాల సైతాన్ హైసాకరే తుమారనషీబ్ మె అల్లా వైసాలిఖే క్యాకరె?

[ప్రవేశము—ఉత్తమశీలుఁడు ఒకవైపున]

ఈమె యెవరై యుండును? ఈమె రూపలావణ్యముఁ జూడ మహారాష్ట్రుల సంజాతవలెఁ గన్పట్టుచున్నది. ఐన వెంటనుండిన వీని నడిగి తెలిసికొనియెద. (సేవకుని చేసైగచే బిలచి చెవులనేమో జెప్పును)

సేవ—ఓమాటల్ మాకీ పనికిరావు. లచ్ఛల్ లచ్ఛల్ గాఃవాలా.

ఉత్త—సేవకా! నీకు ద్రవ్యాపేక్షగలదేని యట్లనేయొనం గెద ఎంత ధనమిమ్మనెదవు!

సేవ—(చేతి వేళ్ళఁజూపుచు) లచ్ఛాల్ లచ్ఛాల్ బోలేనై

ఉత్త—అట్లుగాదు ఒకలక్షనిచ్చెద

సేవ—హైహైరో జల్దిదేవ్ బాతుంక్యా

ఉత్త—ఇదిగొమ్ము ద్రవ్యమిచ్చెద.

సేవ—జాంగే చెలో. (నిష్క్రమింతురు)

కాంతా—హా! దైవమా! వీరలేదియో రహస్యాలోచనఁ జేసినారు. వీరి యాలోచనచే నాకేమియు ముప్పుగల్గదుగదా!

[ పునఃప్రవేశము ఉత్తమశీలుఁడు, సేవకుడు ]

సేవ—అమ్మా! ఈన మహారాజ్ యీనయింటికి యెల్లిపో,

కాంతా—అయ్యో! సేవకా! నట్టేటఁ బుట్టముంచినట్లు నన్నీ యువకుని కొసంగితివా ఇంక నాగతియేమి,

సేవ—పర్వానై పర్వానై రోపకో (ఉత్తమశీలునితో) మహారాజ్ పిఠారా శిర్మెరకో జాతా (పెట్టెనెత్తుకొని) తల్లి బిడ్డ మల్లె నూడాల మల్లిజాతుం (పోవుచు తనలో) మహారాజ్ భోత్ పైసా దియ్యా బడాసంతోషం ఆయా (నిష్క్రమించును)

ఉత్త—కాంతా! రమ్ము నాగృహమునకుఁ బోవుదము.

కాంతా—అన్నా! నీగృహంబునకేల రావలెను?

ఉత్త—లక్షరూప్యంబులిచ్చి నిన్ను కొనుక్కొంటినిగదా!

కాంతా—(తనలో) కట్టా! ఎంతఘోరముజరిగినది! ఓరీ! మర్మార్గా! సేవకా! ఎంతకార్యమొనర్చితివిరా! (ప్ర అన్నా! ఇట్టి కోర్కెనుఁ గోరక నీ మార్గమున నీవుఁబొమ్ము.

ఉత్త—ఏమి? ద్రవ్యమెచ్చించి నిన్నుంగొని నాదారి నేనుఁ బోవలెనా. (అని పట్టుకొనఁబోవును) (అనుబంధము 8)

కాంతా—(తప్పించుకొని)

గీ. పరనికాంతనుఁ గోరుట ♦ పాపకుమను
నెఱుఁగవా ? మూర్ఖ ! యిది నీకు ♦ పరువుగాదు
నీదు భార్యను, స్నేహితోత్తమ ♦ నెగడి వరలుఁ
బట్టనెంచిన హీనమానవ ? ♦ పాపి ! చెనఁటి !

ఉత్త—లోకమోహిని !

సీ. మానినీమణి ! మోవి ♦ మధురసంబానిన
ద్రాక్షరసమున్ వేరె ♦ ద్రావవలెనె ?
చంచలాక్షిరో ! నీదు చన్నవఁబట్టిన
హేమగిరుల్ వేరె ♦ వెదకవలెనె ?
ముద్దులగుమ్మ ! నీ ♦ ముఖమండలముఁజూడ
పండువెన్నెలలోన ♦ నుండవలెనె ?
కలికిరో ! నీమేని ♦ కాంతులఁ గనుఁగొన్నఁ
గాంచన లతలనుఁ ♦ గాంచవలెనె ?

గీ. అంబుజాక్షిరో ! నీయూరు ♦ కాండములను
జూడ నారఁభతరువులఁ ♦ జూడవలెనె ?
కుందరదన ! మీదటనిన్నుఁ ♦ గూడియుండు
సౌఖ్యమునమించునదె స్వర్గ ♦ సౌఖ్యమైన.
తరుణీ ! ఇంక జాగొనరింపక నామనోరధముఁ దీర్పుము.

(పట్టుకొనఁబోవును)

కాంతా—(తనలో) అయ్యో ! దైవమా ! ఇంక నేనేమి నేయుదును ? వీడు కామాతురుఁడై నన్నుఁబట్ట సాహసించెనే ! (ప్ర) అన్నా ! నామనవి వినుము పరనారులగోరుట పాతకంబుకాదా ? మఱియు రక్తమాంసభూయిష్టంబగు నీతనువును వేవిధంబుల గౌరవ వస్తుసమితితో సరిఁబోల్చి వర్ణించెదవు బుద్ధిమంతుడవగు నీ కిది చెల్లునా ? నే నొకటిఁ జెప్పెదవినుము.

సీ. బంగారు కలశముల్ ♦ పాలిండ్లఁటనియంద్రు
దుర్మాంసయుతమైన ♦ తుండ్లుకావె
సరసిజాతములు లో ♦ చనములటందురు
పుసిగారు ముఖములో ♦ పుండ్లుకావె
బింబఫలంబులే ♦ పెదవియంచని యంద్రు
దిగువ నెత్తురితోలు ♦ తిత్తిగాదె
కార్యతమునె కౌన ♦ టంచని యందురు
నడయాడు సన్నని ♦ నరముగాదె
గీ. శుకపికధ్వనులంద్రు వ ♦ చోరచనల
నిత్తురులోనుండి గూసెడు ♦ గుత్తుగాదె
మేల్మి బంగరునిగ్గని ♦ మెచ్చుకొందు
రయ్యయో! యిది మాయకా ♦ యమ్ముగాదె!
అన్నా, నీకును నాయట్టి తోఁబుట్టువు లుండియే యుండిరి. వారివలె నన్నుఁ జూచుము. నీకు నమస్కరించెద. వీడిపొమ్ము. చెరు గొడ్డి వేడెద. (అని పెడముఖముఁ బెట్టును.)
ఉత్త—తల్లీ! సుగుణవల్లీ! నీవు చెప్పిన నీతిచే నాకు బుద్ధి వచ్చినది. నేఁటి నుండియుఁ బరసతులఁ దల్లులుగ నెంచి మెలంగెద ఇంకనాపై నేరముంచక క్షమింపుము. (కాళ్ళపైఁ బడును.)
కాంతా—అన్నా! లెమ్ము నీకు శుభమగుఁగాక.
ఉత్త—తల్లీ! ఒక్కమనవి నీపై భ్రాంతిచే ద్రవ్యమంతయుఁ గోల్పోతి నిందుల కేమి సెలవు?
కాంతా—అయ్యా! నీధనమంతయుఁ బోయెనని చింతింప కుము. నీవీధనమునకుఁ బదిరెట్లెక్కుడగు నొక యంగులీయకము నాకడ గలదు దానిని నీకొసంగెదఁ గైకొని నీఋణవిముక్తి జేసికొ నుము ఇదిగో! (అని పెడముఖముతో నిచ్చును)

ఉత్త—(తీసికొని) అమ్మా! ఇది నాకమ్ము జెల్లునా? దీని నింత నింతవెల కెవరంగీకరించి స్వీకరింతురు.

కాంతా—అయ్యా! సందియము మేల, రాజాధిరాజులు గ్రహింతురు.

ఉత్త—అట్లయిన నీయుంగరము నొక్కఁజూపక మగువలకు నీపట్టణమునఁగల సత్రమందుంచుము. నేదీని విక్రయించుకొని వచ్చెద నీకేమియు భయములేదు పోవుదము రమ్ము.

(నిష్క్రమింతురు)

కాంతా—(పోవును) దైవమా! ఇంత నాకెట్టియాపద. గల్గఁ జేయ నెంచితివి సర్వేశ్వరా! సర్వమునకు నీవని నమ్మియుంటిని. ఎట్లు జేసినను సరే. (నిష్క్రమించును యవనికజారును)





శ్రీ

# కాంతామతి

## తృతీయాంకము

### ప్రథమరంగము

మహాపాతకపురములో దుర్బుద్ధి యాస్థానము.

[ప్రవేశము : దుర్బుద్ధి అనృతవాది, మహాపాపి అనుమాత్రులు]

దుర్బు—

ఉ. క్రూరతనంపు చేష్టలకు ♦ గోవిదుడీతడటంచు లోకుల
యాస్యారె! నుతించుచుండ్రు మరి ♦ యాదగ నీభువనంబులెల్ల నా
పేరువినంగ బెగ్గడిలు ♦ బెబ్బులి పోలికి నడ్డులేక న
వ్వారిగ రాద్యపాలనము ♦ వాంఛదలిర్పగఁ జేయుచుంటిగా.

సచివవరా! ప్రజలేమనుచుండిరి ?

అనృ—నోరెత్త వీలున్నదా యీయాజ్ఞచొప్పున ప్రజలనంద ఆసాధించి, వేధించి, బాధించుచుంటి, మీశాసనం బతిక్రమించ నే నెంతవాడను. ఇది రాజశాసనముకదా.

దుర్బు—అనృతవాదీ! నీయట్టి సచివపుంగవుఁడు గల్గనాకేమి కొరత ఉండిన నీయట్టి మంత్రియే యుండవలయును.

అనృ—చిత్తము! అంతయు తమయాజ్ఞయేగదా!

దుర్బు—మహాపాపీ! నీకార్యములెల్ల నెఱుఁగీయక ప్రధానముగ నెంచి యాచరించుచుంటివా!

మహా—ఇట్టి విషయము నాకు మీరు దెల్పవలెనా! నా నామధేయమే నేనొనరించిన కార్యములఁ దెల్పునుగదా!

దుర్బు—సంతోషమైనది. మరచితిని కులకాంతలఁబట్టి వెలకాంతలవలె నిర్బంధించుచుంటివా!

మహా—నిర్బంధించుటయేగాదు నన్నుఁగాంచిన నారీమణులు పర్వులెత్తి యేమూలనో దాగుచుందురు. అట్టివారింబట్టి వెలికీడ్చి నా యిచ్ఛవచ్చిన ట్లొనర్చుచుంటిని. అందుచేఁ బ్రజలెల్లరు నన్నుంజూచి పైకేమియు ననఁజాలక లోలోన నన్నేమో దూడిపోసికొనుచుందురు కా! నేననినఁ బ్రతివారికి గుండెదిగులు ప్రాణతల్లడముగనే యున్నది.

దుర్బు—సచివచంద్రా! నీవుకదా యీ దుర్బుద్ధి మహారాజునకు మితిలేని యానందమొసగుచుంటివి? మంత్రియన నిట్లుండవలయు.

మహా—ఇదంతయు దమ కరుణయేగదా!

దుర్బు—మంచిది.

[ప్రవేశము సేవకుడు]

మహారాజా! ఎవ్వడో యొకవర్తకుడట తమ్ము దర్శింపవచ్చి యున్నాడు. సెలవా?

దుర్బు—మంచిది ప్రవేశపెట్టుము.

[సేవకుఁడు నిష్క్రమించి, పునఃప్రవేశము ఉత్తమశీలునితో]

ఉత్త—మహారాజా! వందనము. (నమస్కరించును)

దుర్బు—ఓయీ! నీవెవ్వడవు? ఏమి కార్యార్థమై వచ్చితివి?

ఉత్త—నాకడ నొక యంగుళీయకము కలదు, దాని రొక్కముగ మార్చుకొనవచ్చితిని. మీరు వలయునేని దీని గ్రహించి ద్రవ్యమొసంగుడు (అని యిచ్చును)

దుర్బు—(తీసుకొని చూచి) ఓరీ! యిది నీకెచ్చట లభించినది? స్త్రీలుధరించు దానివలెగన్పట్టుచున్నదే! దీనినెందైన తస్కరించితివా?

ఉత్త—అయ్యో! అదేమి న్యాయము ఇది నా సొత్తుగదా? యూరిట్లుఁ బల్కుట న్యాయమా?

దుర్బు—న్యాయమో అన్యాయమో? నిక్కము దెల్పుము. లేకున్న శిక్షింపబడుదువు.

ఉత్త—(తనలో) ఈపరిపాలనము దుష్టబుద్ధియన్న పేరునకు తగియే యున్నది (ప్ర) తెల్పెదవినుడు.

దుర్బు—తెల్పుము. న్యాయమోల బుద్ధిగల్గి ప్రవర్తింపుము.

ఉత్త—మీరు పల్కినది నిజమేయగు. ఈయంగుళీయక మొక రాచకన్నియది. ఆబిడ దీనివిక్రయించుకొనిరమ్మన వచ్చితిని.

దుర్బు—ఆస్త్రీ యిప్పుడెందున్నది?

ఉత్త—ఈపురమునందు గల సత్రమందున్నది.

దురు—అట్లయిన నాబిడను నాకడకుఁ దోడ్కొనిరమ్ము!

ఉత్త—చిత్తము. (నిష్క్రమించును)

దుర్బు—మంత్రులారా! ఆరాచకన్నె నెట్లయినఁ గూడవలయును గాన మీరు సమయోచిత మెఱింగి సంచరింపుడు.

[పునః ప్రవేశము ఉత్తమశీలుడు కాంతతో]

దుర్బు—

చ. చక్కనిచుక్క యీవికచ ♦ సారసనేత్రి, యెవాని కాంతయో?
చుక్కలతేని భామినియొ? ♦ సూటిగ మారుని కాంతయో? భళా!
నిక్కమెఱుంగలేనయితి ♦ నీటునుఁ గోటును జూడఁ జిత్తమున్
జిక్కుల పాల్పడెన్ పిదపఁ ♦ జేసెడి కార్యము తోఁచదాయెఁగా!

కాంతా! ఈయఁగుళీయక మెవరిది?

కాంత—(తలవంచి) నాదియే.

దుష్ట—మంచిది మిత్రులారా! ఈమె రాచకన్నెగా గన్పడుచున్నది. ఈమె యీస్థానమం దుండఁదగదు. కావున యీమెం బురంబునకుఁ గైకొనిరండు.

మంత్రుల—చిత్తము. (కాంతామతితో నిష్క్రమింతురు)

దుష్ట—ఓరీ యింక నీదారిని నీవుఁ బొమ్ము,

ఉత్త—అయ్యో! ఇదెక్కడి న్యాయము? ధనమీయక యుంగర మీయకయుఁ బొమ్మనుట?

దుష్ట—ఇంక నాకడ నధికముగఁ బ్రేలకపొమ్ము!

ఉత్త—అట్లయిన నాయుంగర మొసంగుఁడు పోయెద.

దుష్ట—పోయెదవా లేదా? లేకున్న చెఱయం దుంచెద ఎవడురా?

సేవ—(ప్రవేశించి) దేవా! సెలవు.

దుష్ట—నీవీ దుష్టుని మన పురమునందుండకుండు నట్లావలకు బారఁదోలుము,

ఉత్త—(తనలో) ఔరా! ఎంతన్యాయ పరిపాలనము! ఈ పట్టణమంతయు నిట్లనే యుండుఁగాఁబోలు!

సేవ—ఏమేమో గొణుగుచుంటివి ఏమిది? ఇందుండి తరలి పొమ్ము.

ఉత్త—పోయెదఁగాని సేవకా! నీపేరేమి!

సేవ—నా పేరా! మహానీచుఁడు.

ఉత్త—(తనలో) మంచినామధేయమే మీరాజునకు మీరాజ్యమునకు పరిపాలనకు దగియేయున్నది.

సేవ—అధికముగా వాగకపోయెదవా లేదా? (అని నెట్టును)

ఉత్త—(తనలో ఇంతటి మహాన్యాయ పరిపాలన మెందునుఁ గానము "వినాశకాలే విపరీతబుద్ధిః" యనునట్లు రాజులకు వినాశకాల మాసన్నమైన విపరీతబుద్ధులు గల్గును. (నిష్క్రమించును)

దుర్బు—సేవకా! నీవనిపోవ బొమ్ము. (సేవకుడు నిష్క్రమించును) నేనింక జాగుసేయక నాయంతఃపురమునకుఁ బంపిన యాకాంతతో సుఖము లనుభవించెదఁ గాక.

[ నిష్క్రమించును యవనికజారును ]

ద్వితీయరంగము—అంతఃపురము

దుర్బు—తన్వీ! పలుకవేమి? నాపై యలుకా?

ఉ. కోపమదేలనే? యమిత ♦ కోరికతో నిను వేఁడుచుంటి సం
తాపముఁ దీర్చి బ్రోవుమింక ♦ తాళఁగఁజాలనె మందయాన నా
ప్రాపుగఁజేయవేమి? మధు ♦ రంబగు పల్కులుపల్కవేమి? నేఁ
బాపముఁ జేసినాఁడనె? కృ ♦ పామతి నన్గడ తేర్చు వేగమే.

కాంతా—(నిరుత్తరయగును)

దుర్బు—కాంతా! యెంతపిలచినను బలుకవేమి? ఔను! మాటలతోఁ గార్యములగునా? నిన్నింక బలిమినిఁ జట్టుటయే యుచితము.

కాంతా—(తలవంచుకొని) అన్నా! నేనన్నోవిధములఁ బ్రతిమాలుచుంటినే! కనికరము లేదా? నీతోఁబుట్టువునని తెల్పితినే! ఇంక నీమాధ్యము వీడవే? కట్టా! యేమిగతి!

దుర్బు—కామామణీ! నన్నేల బ్రతిమాలెదవు? నీవు బ్రతిమాలినంతనే మిన్నకుందు ననుకొంటివా? అదికల్ల ఈదుర్బుద్ధి మహారాజు గుణగణంబు లెఱుఁగక మాటలాడెదవేమి?

కాంతా—అన్నాయని యెన్నోవిధముల బ్రతిమాలినను నీబుద్ధి మరల కున్నదే? నీవు క్షత్రియుండవు కావా? క్షత్రియధర్మము లెఱుంగవా? నీకుఁ దోఁబుట్టువులు లేరా? నీభార్య నెవ్వఁడేని నిర్బంధించ నీకు సమ్మతమగునా? ఇంక నీదుర్బుద్ధిమాని సన్మార్గము ననుసరింపుము.

దుర్బు—కలికీ! నీవెన్ని విరసోక్తులాడినను సమ్మతమేకా! నీవు నామనసంతాపము దీర్చునంతవరకు నిన్ను విడవను.

కాంతా—ఓరీ! నీరాజ్యమందుగూడను నిట్టివారలే యుండిరా నీతి నుపదేశించువారలు లేరా? ఒకవేళ యుండినను వారి యుపదేశము నీకు విషమయ మయ్యెనా?

మత్తకోకిల

దుర్బు—మూఢబాలికి నోర్వలేనిక ♦ మాటలేటికి? మానినీ!
ధీరుఁడీ దుర్బుద్ధియుంచుము ♦ ధీమతిన్ ననుగూడుమీ
కాంతా—ధీరబుద్ధిగలార లన్యుల ♦ స్త్రీల గోరుదురే? బళీ!
ఘోరపాపంబనుచు మదిలో ♦ గొంకవేలర? మూర్ఖుడా!
దుర్బు—పాపమెట్టిదో దెల్పవే మ్మదు ♦ పాటలాధరి! వేగమే
గోపమేలను జాగుసేయక ♦ కోర్కె దీర్పవె కామినీ!
కాంతా—పాపమెట్టిదో దెల్పవలెనా? ♦ పాపుడౌమరి నీవెనా
ప్రాపుజేరకు దవ్వునుండుము ♦ బాడిగాదిది నీచుఁడా!
దుర్బు—కాంతామణీ! పాపమనునది కలదా? పరాంగనలఁ గూడిన బరువుపోవునా?

సీ. పరనారులను గూడ ♦ పాకాసుర విరోధి
సురగణంబుల యందు ♦ పరువుచెడెనె?
కాంతా—పరనారి యహల్య ♦ భామఁగోరి యతండు
పడరాని యిక్కట్లు ♦ బడఁగలేదె?
దుర్బు—తారతోఁగూడిన ♦ తారాపతికి యేమి
లోపంబు గల్గెనే ♦ లోలనేత్రి
కాంతా—తారతోఁగూడిన ♦ తారేశుఁ గనలేదె
కళలు క్రమంబుగాఁ ♦ దరిగియుంట
దుర్బు—రాధతో స్నేహంబు ♦ రహిసల్పు శ్రీకృష్ణు
నాదిదేవుండని ♦ యనఁగ లేదె?

దుర్బు—గీ. ఏలనీకథలెల్లను ♦ చాలుచాలు
నాదు కోరికదీర్పవే ♦ నళినవయన!
కాంచ — చాలు చాలింక బుద్ధి సి ♦ కేల లేదొ
అరయ నన్నోర నిడుముల ♦ నందగలవు.

దుర్బు—మితారీ! నేనింక నిలువఁజాల. (అని చెయ్యిపట్టుకొన బోవును.)

[ అనుబంధము 9 ].

కాంతా—(తనలో) వీరి బారినుండి యెటులయిన కపటో పాయంబుచేఁ దప్పించుకొనవలెను. (ప్ర) రాజా! తొందరపడకుము.

దుర్బు—కామినీ! ఏమిది. తెలియబల్కుము!

కాంతా—తెల్పుటకుఁ గొంచెము సందియముగల్గి నోరాడుట లేదు.

దుర్బు—సందియ మక్కఱలేదు సర్వంబు దెల్పుము.

కాంతా—నే నెంతకాలము నుండియో యిట్లుగా భ్రిమ్మరుచుంటిని.

దుర్బు—ఎందులకు?

కాంతా—నామదికి నచ్చిన పురుషుఁ డెందు దొరకునాయని

దుర్బు—నీమదికి నే నచ్చియుండలేదా?

కాంతా—ఆ నచ్చకేమి!

దుర్బు—నచ్చియేయుంటినిగదా? ఏల నింత రాద్ధాంతము జరిపితివి.

కాంతా—నాయెడ నెంత యనురాగము కలదోయని జరిపితి.

దుర్బు—ఎంతమాట! లేకేమి నీవెట్లొనరింపుమన్న నట్లొనరింపనా!

కాంతా—అట్లయిన నిన్నే వరించితిని.

దుర్బు—ముమ్మాటికి నిజమే ?

కాంతా—ఊఁ అందుకే మరి వచ్చినది.

దుర్బు—అటులైన జాలమేల? రమ్ము యంతిపురంబునకు.

కాంతా—(తనలో) ఎట్లయిన వీనిని నమ్మించి యావలకు దాటవలెను. (ప్ర) పిచ్చిరాజా! అప్పుడే యంతిపురంబునకా? ఇల్లలికి ముగ్గు పెట్టినమాత్రమున పండుగ వచ్చునా ?

దుర్బు—ఇంకేమి యాటంకము గలదో నుడువరాదా ?

కాంతా—నీక్షేమముఁ గోరి చెప్పుచుంటిని. నీవంగీకరించిన నీకుఁ దక్కుదును.

దుర్బు—నా క్షేమముఁ గోరియే చెప్పుచుంటివా ?

కాంతా—ఊఁ అదేమరి.

దుర్బు—ఐన జాగేల ? శీఘ్రముగఁ జెప్పుము.

కాంతా—వినుము. నాకొక వ్రతము కలదు.

దుర్బు—అది నాకడనే తీర్చుకొనరాదా !

కాంతా—అది తీర్చిన నీకోర్కెయే దీరగలదు

దుర్బు—ఏమది తెల్పుము.

కాంతా—అది గౌరీవ్రతము

గుర్బు—ఆవ్రతమున కేమికావలయును ?

కాంతా—అందులకా ? లెక్కలేని ధనవ్యయము కాగలదు.

దుర్బు—అందులకు నాకు సమ్మతమే యగు, ఇంతియేగదా ? మరేమియు లేదుగదా?

కాంతా—లేకేమి? మఱొకటి పెద్దనియమమే కలదు.

దుర్బు—అంత పెద్దనియమమేమి? అదియుఁ జెప్పుము.

కాంతా—వినుము నాకొక సౌధము నిర్మింపవలయును. అందు నాకారుమాసముల నారుదినంబులు గౌరిని నే పూజించవలయును అందుల కనేక దానము లొనర్పవలయును. అందుకుఁ దగిన ధనము వలయునప్పుడెల్లఁ బంపుచుండవలెను.

దుర్బ—

గీ. ఇంతకాలము గడుపీయ నెట్టులోర్తు?
కొద్దికాలంబుగా మార్చు కొనకయున్న
నేను జీవి తుననుమాట మాని వేడ్క
మదిని యోజించుకొనుమింక మందగమన!

అబ్బా! ఆరుమాసముల యారురోజులే? అంతవరకు నేను నిలువగలనా? పోనిమ్ము, ఆరుమాసములు వీడి యారుదినములే చేయరాదా?

కాంతా—అట్లొనర్చుటకు వలనుపడదు తొలుత, నీయట్టి పురుషశ్రేష్ఠుడును, రాజకులాభరణమును దొరకునాయని యట్లొనర్చితిని కాని నీ వింత శీఘ్రముగ నాకుఁజిక్కుదువని తలంచనైతి. అయ్యో! ఏమి నాబుద్ధిమాంద్యము అప్పుడు నాకింతజ్ఞానముండిన యిట్లొనర్చనుగదా?

దుర—ఎట్లో ప్రాణము నిల్పుకొందును లే.

కాంతా—మరొకటి మరచితిని.

దుర్బ—ఏమది?

కాంతా—నావ్రతము సమాప్తముగునంతకును నీవు కాని నీ సేవకులు గాని నావ్రతాలయముకడకు రావలనుపడదు.

దుర్బ—అయ్యో! ఏమిది నిన్నుం జూచియైనఁ బ్రాణములు నిల్పుకొందమనుకొంటినే!

కాంతా—నీరూపము నాకన్నుల కగుపడరాదు. నీశబ్దమునా చెవుల బడరాదు. అట్లుగాక తప్పిచరించితివేని శిరము వేలువ్రయ్యలై చత్తువు. (కొంచెమాగి) అయ్యో! రాజా! నీవు చచ్చిన నాకింక దిక్కెవ్వరు? ముందు నాగతి యెట్లున్నదోకదా? నీక్షేమమును నా సౌఖ్యమును గూర్చి [illegible]తిని.

దుర్బ—ఓహో! నాక్షేమమునుగూర్చియే సర్వము దాపకఁ జెప్పితివా?

కాంతా—ఊఁ అందుకేమది
దుష్ట—అటులైన రమ్ము పోవుదము (పోవుచుండును)
కాంతా—దూరముగా ముందు నీవు సాగుము.
దుష్ట—రమ్ము (ముందు పోవును)
కాంతా—(వెంటబోవును) (యవనిక జారును.)

## తృతీయరంగము - కాంచనమాల సౌధము

[ప్రవేశము—కాంచనమాల]

కాంచ—ఆహా! మోహమెంతపాడుది? తన శరీరము తన నెఱుంగకుండఁ జేయునుగదా? నా యందచందములఁజూచి రాజాధిరాజగు ప్రతాపసేనుఁడు నన్నుఁగూడి ధనమెల్లఁ గొల్లపెట్టినాఁడు ఒక్కధనమేమి! రాజ్యమంతయుఁ గోల్పోయి తుదకు నిలువ నీడలేక గుడుపఁగూడు లేక హాహారవమెత్తి చరించుచుండె బౌరా! వారకాంతపొందెంత ధనాధిపునైనను ధనహీనునిగఁ జేసి పడరాని శ్రమలఁ బాలొనరించునుగదా! ప్రతాపసేనా! నీవు నాచెంతకుఁ జేరునప్పుడెంత గౌరవముగనుంటివి? పిమ్మట నాకు దాసుఁడవై పెద్దల వాక్యముల వినక రాజ్యమును, భార్యను, గోల్పోయితివే! ఇందులకు నేనేగదా కారణము? ఛీ! నేనెంత పాపురాలను? ఓ ప్రతాపసేనా!

సీ. నారూపమును జూచి ♦ నన్ను వీడకఁగదా?
గురునాజ్ఞ మీఱుచుఁ ♦ గులికినావు
నాయౌవనముఁ జూచి ♦ నమ్మివచ్చితెగదా?
భార్యను గానకుఁ ♦ బంపినావు
తుచ్ఛసుఖంబంచుఁ ♦ దోఁచకుండుటఁగదా?
కులగౌరవము మంటఁ ♦ గలిపినావు
నృత్యగీతములను ♦ నిత్యంబు వినిగదా
మేనుమఱచి నీవు ♦ మెలఁగినావు

గీ. రాజ్యపాలన మంతయు ♦ రగులబెట్టి
ప్రజల సౌఖ్యంబు లన్నిఁటి ♦ బాడుజేసి
నాదు చెంతకుఁ జేరి నన్ ♦ నమ్రునావు
పొలవెలంకులతో బొందు ♦ వెతలఁ గాంచె.

నే వగవ నేల? బుద్ధిహీనులై విటకాండ్రు నాగుమ్రముల దరి జేరి మమ్ము ప్రార్థింప మేమేమి సేయగలము? అంతయు విటుల దే లోపము మేము వారల ప్రార్థించితిమా? మాగృహంబు లలంకరించు మంటిమా? తల్లిదండ్రులమాటలు సరకుజేయక సోమరులై చదువు సంధ్యలమాని త్రాగుబోతులై మావాడఁజేరి సర్వముఁ గోల్పోవు చుండిరి. ఇందులకు మేమేమి సేయఁగలము? మా దేమిలోపము?

(నిష్క్రమించును)

[ప్రవేశము—ప్రతాపసేనుఁడు ఒకవైపునుండి]

ప్రతా—ఔరా! కాంచనమాలా! ఎంతజేసితివె?

ఉ. కూడును నీళ్ళులేకఁ గను ♦ కూరికి నేఁటికి మూడునాళ్ళ నే
జాడనుబోదు వేశ్యనిట ♦ పాదము కొంచెము బెట్టుచుంచు నే
వేడెద నిప్పుడాసఖియ ♦ వేయదె బోనము పొట్టనిండ? మో
మాడకఁబోదు పూర్వ విధి ♦ మాచితితో మఱి సానియింటికిన్.

ఆహా! సర్వమును కాంచనమాలకు ధారవోసితి అన్నపానీయంబులకు దూరమైతి. కులాంగనను గోల్పోయితి బంధుజనంబులకుఁ బగవాడనైతి. ప్రజలకు తృణప్రాయుడనైతి కట్టా! తుదకు నేను మూఁడు దినంబులనుండియు నింతకూడు దొరకక క్షుద్బాధచే మిగుల కృశియించి పూర్వపరిచితురాలగు నా కాంచనమాలయయిన యింత కబళముఁ బెట్టకుండునాయని నమ్మివచ్చితి ఆమెయు నేమనునో! ఏమి నా వెఱ్ఱి! కాలము దీరినను ధనహీనత సమయమునను, స్నేహితు లుందురా? గౌరవముండునా? తుదకుఁ గడజాతివాఁడు సైతము తన

కన్న హీనునిగఁ జూచును. ఇంతయేల? కాంచనమాలను బిలచెదఁ గాక. (తలుపు తట్టుచు) కాంచనమాలా!

[ప్రవేశము—కాంచనమాల ఒక వైపునుండి]

ఎవ్వడవు నీవు? కాంచనమాలాయని ఖండితముగఁ బిలుచు చుంటివి? నీవెవ్వఁడవు?

ప్ర—కాంచనమాలా! యింతలోనే మఱచితివా?

కాంచ—ఎవఁడవో యెఱుంగము ఆవలకుఁ బొమ్ము.

ప్రతా—కాంచనమాలా! మనవి.

గీ. కూడుఁదిని నేఁటికిని నేను ♦ మూఁడునాళ్ళు
   లెందు దొరకకఁ గబళంబు ♦ నిందుఁజేరి
   వేఁడుచుంటిని పట్టెడు ♦ వేయుమమ్మ
   మానినీమణి! కాంచన ♦ మాల! నాకు.

కాంచనమాలా! ప్రాణములు పోవుచున్నవి. ఇంత ప్రసాద మొసఁగితివేని దానినోట నిడుకొని పోయెదను. పూర్వస్నేహమైనఁ దలంపుమా.

కాంచ—బుద్ధిహీనుఁడా! నీవు నాకు స్నేహితుఁడవా? నోరు మూసికొనుము. ఈతూరిట్లు భాషించిన తగిన బుద్ధిజెప్పెద పొమ్ము సాదము లేదు గీదము లేదు. (అని లోనికిఁ బోవును)

ప్రతా—ఆహా! ప్రతాపసేనుని కీవేశ్యాస్నేహమువలన నెట్టి గతి కలిగినది! తుదకు నొక్క మెతుకైన దొరకక క్షుద్బాధచే ప్రాణములు వీడవలసెనే! హా! దైవమా! ఎంత నిర్భాగ్యుఁడ!

సీ. తండ్రి తద్దినమైనఁ ♦ దలఁచక మదిలోన
      వెలకాంత చెంగట ♦ మెలఁగినాఁడ
   భార్య సౌందర్యంబు ♦ భావమందెంచక
      వేశ్యకాంతకుఁ జిక్కి ♦ వెలసినాఁడ

కులగౌరవము నుంత ♦ గోల్పోవు టెఱుఁగక
భోగ కాంతకు సేవఁ ♦ బూనివాఁడ
రాజ్యమందుఁ బ్రజల ♦ రాయిడు లరయక
పణ్యాంగనగృహానఁ ♦ బండినాఁడ
గీ. యింతకును బుద్ధిలేక నో ♦ కాంత చెంతఁ
జేరి నేనిట్టి కష్టముల్ ♦ దీరిపోవ
కుండునట్లుగఁ జేసుక ♦ యుండినాఁడ
వేశ్యలను గూడు వారి కీ ♦ వెతలె గతిగ !

ఓ భారతీయులారా! సోదరులగు నోవిటులారా! ఇదియంతయు నా యనుభవముచే నుగ్గడింపుచుంటి.

సీ. ధనమంతయును లాగి ♦ తన సేవకునిఁ జేయు
వెలకాంత పొందింక ♦ వలదు వలదు
రాజ్యమంతయు మాపె ♦ రాజను మెడఁబాపె
వెలకాంత పొందింక ♦ వలదు వలదు
పట్టెడన్నమె దెందు ♦ పుట్టకుండఁగఁజేసె
వెలకాంత పొందింక ♦ వలదు వలదు
సన్యాసి వేషంబు ♦ నన్యాయముగ వేసె
వెలకాంత పొందింక ♦ వలదు వలదు
గీ. వేశ్యకాంతను గూడ నీ ♦ వెతలు నాకు
వచ్చిచేరెను గటకటా ! ♦ నిశ్చయముగ
సుగుణధనులార ! భారత ♦ శూరులార
పోకుఁడింకను వేశ్యల ♦ పొందుకొఱకు.

మఱియు,

మ. వెలకాంతల్ గపటంపుఁబ్రేమ సహాహా! ♦ వేల్ వేలు ద్రవ్యంబు
లియ్యల బెన్నోసియులాగి భిక్షుకుని గా ♦ సింత్రైన లేకుండఁగన్

యిలువాకిండ్లను నమ్మఁజేయు రకటా! ♦ యిస్త్రీ! మహాసూరులా
వెలయాండ్రన్ గలియంగఁ బోకుఁ డనుచున్ ♦ వేనోళ్ళ బ్రార్థించెదన్

ఉ. గానకళాదులన్ గనియు ♦ కాముడు నెత్తికియెక్కి యెక్కడో
మానము మంటఁగల్పి మతి ♦ మాయుఁడనై జరియించినాఁడ యా
మానిని వేశ్యకాంత యను ♦ మానము లేకను జేసె భిక్షుకున్
మానిని రాజ్యలక్ష్మి! ప్రియ ♦ మానినిఁ! గోల్పడినాఁడ దైవమా!

గీ. చిచ్చుఁ గొంపకు నిడికొని ♦ చింతనొంద
ఫలముగల్గునె? పుడమిలో ♦ భవ్యులార!
కల్గె యింపుడుకత్తెచేఁ ♦ గష్టము లిటు
మీర లైనను సద్బుద్ధి ♦ మెలఁగుఁడింక.

సర్వముఁ గోల్పోయిన నేనెంత నీతిఁజెప్పినను నేమిలాభము? తొలుత నాగురుఁడు నాకెంతయో నీతిబోధించలేదా? నే నద్దాని వింటినా? పాప మాగురూత్తముని సైతము ప్రల్లదంబుల బల్కినది వేశ్యమాటలు వినియేగదా? రాజ్యమందుఁగూడ నిల్వనీయకఁ బరదేశములకుఁ బారఁదోలిన గురుద్రోహినగు నాకిదియే శిక్ష (అనుబంధము 10) నేనింక నాప్రాణకాంతయగు కాంతామతిని గాంతారమందు నెమకుచు ఈవేషముననె దిరిగెదగాక (అని నిష్క్రమించును)

[పునఃప్రవేశము — కాంచనమాల]

ఎట్టిపండితుఁ డైనను, నెట్టివీరుఁ డైనను, నెట్టిధనికుఁ డైనను, మోహము పరదాసునిగఁ జేయునుగదా? ఆహా! మోహమెంత చెడ్డది? ఈపుడమియందు వారాంగనల కులమువంటి నీచకులమును వారివృత్తియంత నీచవృత్తియు నేకులమందును లేదు. దైవము మమ్మును ఒక్కరికే గృహిణులగాఁ జేయక పలువురికేలఁ జేయవలెను? ఇట్టి మా వారాంగన లెందఱనో జోగుల జేసి పడరాని నిందల పాల్పడుచుండిరి. పిత్రార్జితములగు మడిమాన్యము లమ్మి మాకొసంగుమని వేశ్యలు విటులను బాధించిరా? మా లోపమేమున్నది? ఇపుడు మా వేశ్యకులమందు

గూడ సంఘములస్థాపించి వ్యభిచారవృత్తిఁ బారఁద్రోలవలయునని పాటుబడుచుండిరి. చాలవఱకు సంఘ మభివృద్ధిలోనే యున్నది. వ్యభిచారమన్న నీచకులమందుననేగాని మరియేకులమందు లేకుండె. ఇప్పుడన్ని సర్వకులములయందును గలదు. శ్రీమంతులు, సైతమిదే చేయుచుండిరి. వారికిఁ గట్టుబట్టయుఁ దిన మెతుకును లేదా? ఓ భారతీయ సోదరీమణులారా! వారకాంతలారా! నామనవి వినుఁడు.

సీ. అశనమ్ము దొరకక ♦ వసమానమును నమ్మి
కాలంబు గడపెడి ♦ కాంతలార?
అర్థముమహాపై ♦ యాశఁజెందుచునుండి
పరులకూటమిఁగోరు ♦ పడతులార?
తుచ్ఛసుఖముఁగోరి ♦ దోషమెంచకవిటు
లనుగూడి సుఖయించు ♦ లలనలార?
రోగితోనైనను ♦ భోగింప నీసును
సుంతేని బొందని ♦ సుదతులార?
గీ. పాపభూయిష్టమైన యీ ♦ పాడువృత్తి
విడిచిపెట్టుడటంచు నే ♦ వేయిగతుల
వేడుచుంటిని ప్రియులార! ♦ వెలఁదులార!
భరతభవులార! మణులార ♦ భామలార!

ఇట్టి వ్యభిచార వృత్తివలననే యంటువ్యాధులచే క్షీణించి తుదకు సంతానహీనులగుటకుఁ గూడ కారణము మఱియు,

సీ. కులకాంతలను బాసి ♦ కులధర్మముల రోసి
సానిపంచలఁ జేరు ♦ చవటలార!
పిన్న పెద్దలటంచు ♦ నెన్నకమదిలోనఁ
బణ్యాంగనలఁగూడు ♦ పాపులార!
పూర్వార్జితములెల్ల ♦ పూజ్యంబుగాఁ జేసి
రోగమ్ముచేఁ జెడు ♦ జోగులార!

ధనధాన్యములఁ జెల్ల ♦ దాస్యవృత్తినిబూని
జీవనమొనరించు ♦ చెడుగులార!

గీ. వలదు వ్యభిచార వృత్తిచేఁ ♦ గలుగు నఘము
వేశ్యకాంత భోగంబుచే ♦ వెతలు గలుగు
మానుఁడిదియని మ్రొక్కెద ♦ మాన్యులార!
సుగుణధనులార! భారత ♦ శూరులార!

వ్యభిచార వృత్తిచే నఘంబు గలుగుననియు, యశంబు పోవుననియు సనాతన ధర్మములు బోధించుటలేదా? అందు వేశ్యా సంపర్కముచేఁ గలుగు నష్ట కష్టములు కనులారఁ జూచితిరిగదా? ఇంక వేశ్యలఁగోరక వారి స్నేహముఁ జేయకుందురుగాకయని వేవిధములఁ బ్రార్థించెద.

[అనుబంధము 11]

(నిష్క్రమింతురు, యవనికజారును.)

చతుర్థరంగము.

ప్రదేశము—అడవి.

[ప్రవేశము-ప్రతాపసేనుఁడు విషాదమున]

[అనుబంధము 12]

ప్రతా—అయ్యో! ఎంతఘోరము? ఎంతదుండగము? ఎంత పాపము? ఎంతతాపము? కులకాంతను ఘోరాటవుల పాలొనర్చిన మహాపాపుడ. నీచుఁడ. కట్టా! నన్నియధోగతిపాలొనర్చినదిదురాత్మురాలగు కాంచనమాల గాదా! నాకాదుర్జాతి స్నేహంబుఁగల్గకున్న నియ్యగచాట్లు రాకుండునేమో? మోహాంధకారమున మున్ని భార్య మోముంజూడక దాని మాటలే వేదాక్షరంబులని నమ్మిన నాకెంత మోగము సంభవించినది. కట్టా! నాముద్దుగుమ్మనదిసి ముచ్చటింప

నిచ్చినదిగాదు. అంతయు మహాకారడిఁ జేసినది—మాయ యొనర్చినది—మసిఁబూసినది. రాజ్యభ్రష్టునిం జేసినది—అన్నపానీయంబులు లేక యుల్లాడునటులొనర్చినది—తుదకీసన్న్యాసివేషము వేయించినది—అహో! కాలమా; నిన్ను వర్ణింప నేకవికిందగుదు? కవుల కలమునకు గూడ నెదురైతివే?—లోకులను లోకమును నీ స్వాధీన మొనర్చుకొంటివే?—ఔరా! కాంచనమాలా! ఎంతఁ జేసితివే? నీమోహరజ్జువుచే నన్ను బంధీకృతునిగఁ జేసి నన్నెల్లవిధముల సన్న్యాసి జేసితివి గదా? కులటా! నీయాజ్ఞమీరక కులగురువును దేశభ్రష్టునింజేసి తత్ఫలమందుచుంటిని. ఓ ప్రాణప్రియా! కాంతామతీ? నీవెందేగి యుంటివి? అయ్యో! ఈ ఘోరారణ్యమున నే క్రూరమృగంబుల వాతంబడితివో యెఱుంగఁజాల లేక ప్రాణకాంతునిచే నిరాకరింపఁబడిన నేనుండిన నేమి లేకుండిన నేమియని యసూయచే నెందైన ప్రాణములఁ గోల్పోతివో, నాకెవ్వరు దెల్పి నన్నూరడింతురు! నీసుందరవదనారవిందము గాంచు భాగ్యమబ్బునా? అదియేకల్ల. అయ్యో! ప్రాణేశ్వరీ! నీపాలింట దిక్కుమాలిన వేశ్య మహామారి యయ్యెనే! నేను నిన్ను సగౌరవముగఁ జూచి ప్రేమించిన నీకే కడగండ్లు రాకుండునుగదా? ఆవేశ్యలో నేమున్నది? నిక్కముగ నీపాలి మారిని నేనైతిని.

సీ. ఎన్నఁడు నాయింతిఁ ♦ గన్నుదమ్ములఁగాంచి
సంతసంబున నుండఁ ♦ జాలువాఁడ?
నెన్నఁడునాకాంతి ♦ నెలమిమీరఁగఁగాంచి
ముచ్చటలాడుచు ♦ మురియువాఁడ?
నెన్నఁడు నాప్రియ ♦ వన్నెచిన్నెలఁగాంచి
బిగి కౌఁగిటను నెప్పు ♦ డెనగువాఁడ
నెన్నఁడు నారాణి ♦ కున్న సొగసుఁగాంచి
ప్రాణ మిడంచని ♦ ప్రబలువాఁడ

గీ. నన్నుఁ డింకనా దైవంబు ♦ నవ్వు నాఁడె
ప్రాప్తుఁ జేరిచి సౌఖ్యంబుఁ ♦ జూపఁగలదె
గటగటా! యిట్టి పుణ్యంబుఁ గలుగనాదె?
లేదు యీనాఁటి నుండి కిఁకమీఁద ♦ లేదు లేదు.

దైవమా! ఇఁక నే నేమి చేయుదును? నా ప్రాణేశ్వరుని నన్ను గూడుట చేఁగదా నా పురంధ్రి కిట్టి యిడుములు. అయ్యో! శాంతామతీ! శాంతామతీ! నను వ కాల్లడవున్నవి.

[ ప్రవేశము — దూర్వాసుండు ]

ఈతఁ డెవ్వఁడై యుండును? ప్రియకాంతా వియోగంబుచే విషాదమందుచున్నాఁడు. విచారించెద. ఓయీ! నీ వెవ్వఁడవు?

ప్రతా — తాపసేంద్రా! వందనములు.

దూర్వా — శుభమగుఁగాక. నీ వెవ్వఁడవు? విషాదమేల?

ప్రతా — అయ్యా! తొలుత నేనెవ్వఁడనైన నేమి? నేఁటికి సన్యాసిని.

దూర్వా — ఓయీ! కుందకుము. నీ చరిత్రయంతయు విశదీకరింపుము.

ప్రతా — మౌనిచంద్రమా! నేను ప్రతాపసేనుఁడను భూరమణుఁడను. వేశ్యాస్నేహముచే సర్వముఁ గోల్పోయి యీ వేషము ధరించి వేశ్యమాటలు నమ్మి కులకాంతను కానల బారఁదోలిన నీచాత్ముఁడను. నన్ననుగ్రహింపుము. (పాదములపై బడును.)

దూర్వా — (పైకిజూచి) వత్సా! లెమ్ము, ప్రతాపసేనా!

తే. గీ. నీ సతి స్వారసుతయు ♦ నెమ్మిఁ దనర
దివ్యదృష్టిఁ గనుఁగొంటి ♦ దిగులు వీడు
నీకొఱకు నా పతివ్రత ♦ నెమ్మితోడ
గౌరిపూజలచేఁ బ్రొద్దు ♦ గడుపుచుండె.

ఓయీ! చింతకు మునుగకుము కొంతకాలమున నీభార్యం గలియ గలవు.

ప్రతా—మహాత్మా! ఋషిశేఖరుండవని నా ప్రియుండవు. నా యెడ కరుణించి నా ప్రాణేశ్వరి యున్నచోటు దెలుపుము.

దూర్వా—ఓయీ! ప్రతాపసేనా!

తే. గీ. నాల్గుయోజనముల దవ్వు • నంగలదది
భూరిపాతకపుర మందు • బుధులు సతత
మందునున్నది నీ కాంత • నరకము బొమ్ము
సర్వమచ్చటఁ దెలియును నా • సాధ్వివలన.

నాకనుష్ఠానమునకుఁ గాలమైనది, నేనేగెద. (పోఁబోవ)

ప్రతా—(అడ్డగించి) అయ్యా! నా కాంత జీవములతో నున్నాదా!

దూర్వా—ఓయీ! ఏమినీవెఱ్ఱి పోయి కనుఁగొనరాదా?

ప్రతా—అయ్యా! ఆపురమునకు మార్గ మెయ్యది?

దూర్వా—(కోపమున) ఏమీ మార్గ మెఱుఁగవా! కులత వేశ్య నుంచుకొను మార్గ మెవ్వరు బోధించిరి? ధనమదాంధకారమున నకార్యము లాచరించిన ద్రోహివి. ఛీ! నీమోముంజూడ దురితము గును నీదారి నీవుపొమ్ము. (నిష్క్రమించును)

ప్రతా—కట్టా! ఈమానిచంద్రుఁడు నామదికి మఱింతమంట తగిల్చి పోయెనే! ఆ మహాపాతకపుర మెందుగలదో, యెట్లుగవలెనో యెఱుంగనైతినే? హా! విధీ! తుదకు నన్నిట్టిబాములఁ బెట్టితివి? మునిపుంగవుఁడు నాప్రాణేశ్వరివార్త పూర్ణముగ నెఱిఁగింపక పోయెనే! మాఱుబల్కు నాపై తనకోపాగ్నిని బరపి తనదారిని తానేగెనే! అయ్యో? ఇంకేమిదిక్కు? ప్రాణేశ్వరీ! మహాపాతక పురమందుంటివా! ఎట్టికడగండ్లఁ బడుచుంటివో? నీయెడ నేనెంత ద్రోహమొనర్చితిని? ఎంతదుండగము గావించితిని—ప్రియా! నీ దివ్యసుందరాకారము

మహాపాతక పురముండాండెనా? ఇట్టి సందర్శనమునకు వచ్చుచున్నాఁడ హా! దైవమా! ఏమిగాగల?

క. వెలకాంత వలన నిర్విధిఁ
గులకాంతను గోలుపోతిఁ గాంతికిఁ గన్నై
పలుశాపములఁ బడినాఁడను
గలనైన నిటాడనంచు కట్టా! తొలుఁగన్.

(నిష్క్రమించును) (యవనికజారును)

పంచమరంగము—కాంతామతి సౌధము

[ప్రవేశము—కాంతామతి సౌధమందాసీనయై]

(అనుబంధము 13)

అహా! దుష్టుఁడగు యీదుర్బుద్ధిరాజు చేఁజిక్కి నేఁటి కారు మాసములైనది. తొలుత వానితో నారుమాసముల నారురోజులు గౌరీవ్రతము సేయవలయునని యాతని సమాధాన పరచితిని, కట్టా! నేఁటి కారుమాసములు గతించె నింక నారుదినంబులే గడువుగలదు. ఈమధ్యాసములనుండి యనేకులీ వ్రతదానముల కొరకు భుక్తము నకును, నేత్రోత్సవమునకుఁ దిలకించుటకును లెక్కకు మిక్కుటంబుగ వచ్చుచుండిరి. కాని అందు నాప్రాణకాంతుని యాగమనము లేదయ్యె! దైవమా! ఆరుమాసములనుండి రాని నాప్రాణేశ్వరుఁ డీయారుదినములలో వచ్చి నన్నుఁ గాపాడునా? అసంభవము, నాథా!

[ప్రవేశము—ప్రతాపసేనుఁడు]

(అనుబంధము 14)

హా! కాంతామతీ! నేనెంత పాపుఁడ. కనుక నే నాకీగతి గలిగినది.

కాంతా—(తనలో) ఈమహానుభావుని జూడ నా ప్రియకాంతుని పోల్కిగానుండె, అయ్యో! నాకంతటిభాగ్యము కల్గునా? ఒక

రినిఁబోలి మఱియొకరు కారు? ఐన నీయొక్క సమాచార మేదియో తెలిసికొనియెద. (ప్ర) అయ్యా! మీరెవ్వరో యెఱుంగ. కాంతామతి కాంతామతి యనిన నాకెవ్వరుగారు? ఆమెకును మీకును నేమైన బాంధవ్యముండెనా? తెల్పుఁడు?

ప్రతా—ఓహో మహాత్మా నీ! ప్రతాపవర్మ యనువాఁడ నేనెఱుంగ. నా ప్రియకాంతకొఱకై వనములఁ ద్రిమ్మరుచుండ, నందు దూర్వాస మహాముని నన్నుంగని నావృత్తాంతమంత నాలించి "ఓయీ నీభార్య మహాపాతక పురమున ప్రవేశము సేయుచున్నది. అని నుడువ నేని పట్టణముఁజేరి వెదకివెదకి వేసారితిని. నాకాంతజాడ తెలియదయ్యె శరీరమలయుటచేత యీతిన్నెపై శయనించి యెల్లి వెదకెదమని నిందు జేరితిని? ఇదియె నావృత్తాంతము.

కాంతా—(స్వ) ఇదంతయు నావిషయమైన చరిత్రవలెనే యున్నది. ఐన నడగి తెలిసికొనియెద. (ప్ర) మహాత్మా! నీభార్య యేకారణమున నడవుల పాలయ్యెనో తెల్ప వేడెద.

సీసమాలిక

ప్రతా—సీ. కాంచనమాల రో ♦ కాంతయింటికిఁ జేరి
జెప్పినచెల్ల నేఁ ♦ జేసినాఁడ

కాంతా—అయ్యో! యెంత మోహమునఁ బడితిరి? అట్లు సేయఁదగునా? ఆపైని?

ప్రతా—పరిణయంబును లేక ♦ బ్రహ్మచారిగనుండఁ
గూడదటంచని ♦ గురుడు పల్క—

కాంతా—ఆహా! ఆతడెంత పుణ్యాత్ముండు!

ప్రతా—బలవంతముగ నాకుఁ ♦ బరిణయంబొనరింప
గారాగృహమున నా ♦ కాంతనిడితి

కాంతా—పాపమా కాంత నట్టికష్టములపాలుగావించితిరి? పైని?

ప్రతా—అంధకారాలని విని ♦ యాపలిఁజూడక
కానకంపినయట్టి ♦ కలుషమతిని

కాంతా—(స్వ) దైవమా! అంతయు నాచరిత్రమే గదా! పిమ్మట నేమి జరిగెనో? (ప్ర) తరువాత?

ప్రతా—నారాజ్య ధనధాన్య ♦ మా రాజు గ్రహియింప
సర్వము శూన్యమై ♦ జరుగఁబడియె

కాంతా—(స్వ) కష్టా! ఎంత దురవస్థ (ప్ర) అటుపిమ్మట?

ప్రతా—కూడు నీళ్ళకు వాచి ♦ వేడఁబోవగ నది
జేరనీయక గొట్టెఁ ♦ జెప్పనేల

కాంతా—(స్వ) హా! దైవమా! తుదకెట్టిగతిఁ గల్పించితివి. (ప్రకాశముగ) పిమ్మట,

ప్రతా—గీ. అంతకానకు వచ్చి నా ♦ కాంత యెందు
నున్నదంచును వెదకుచు ♦ నున్న నన్నుఁ
గాంచి దుర్వ్యాసుఁడన్మౌని ♦ కనికరమునఁ
దెల్పిపోయెను సకలంబుఁ ♦ దేటపడఁగ.

అంత నగరముఁ బ్రవేశించి నాప్రియకాంత వెదకుచుంటిని.

కాంతా—మహాత్మా!

గీ. మిమ్ము విడనాడి వనములోఁ ♦ మెలఁగి పిదప
వైశ్యుచేఁ జిక్కి వానిని ♦ వదలుకొని
మూర్ఖుఁడైనట్టి యీరాజు ♦ మ్రోలఁబడియుఁ
గుందుచుంటిని మీకునై ♦ డెందమందు.

"ప్రాణేశ్వరా! తొలుత మీరు చెప్పిననిర్భాగ్యురాలగు కాంతామతి యిదియె నాథా! వినుము ఈదుర్బుద్ధి బారినుండి తప్పించుకొన నావశముగాక యేఁడుమాసముల యేడు దినములు నాకు గౌరీ వ్రతముగలదు. ఆపైన నీయిష్టము" అని నుడివి నాపాతివ్రత్యమును కాపాడుకొని యీయేడుమాసములనుండి మీకొఱకై చూచుచుం

టిని. నేఁటికారు దినములు గడుపుగలను. ఇంకమీరు వచ్చుట కల్ల యని దుఃఖించుచుంటిని. నాపుణ్యావశముచే నేఁడు మిమ్ముఁ దిలకించు భాగ్య మబ్బినందుకు సంతసించితిని.

ప్రతా—అయ్యో! కాంతామతీ? నీవీ నిర్బంధమునుండి దాటుటెట్లు? నన్నుఁ గూడు టెట్లు?

కాంతా—ప్రాణేశ్వరా? నేనొక్కటి దెల్పెద వినుఁడు నేఁటి నిశీధమున నిశ్శ్రేణీసహాయమున నే మీ చెంతకుఁ జేరెదకావున మీరిందే శయనింపుడు మౌనము ధరింపుఁడు ఈజాడ దుష్టబుద్ధికిం దెలిసిన కార్యభంగము కాఁగలదు. ఇంక శయనింపుఁడు.

ప్రతా—ప్రాణేశ్వరీ! మరచెదవేమో?

కాంతా—ప్రాణేశ్వరా! మీకొఱకెదురుచూచుచున్న నేను మఱతునా! ఇంక నిదురింతునా?

ప్రతా—(శయనించును)

కాంతా—(స్వ) నేఁటికి నానోము ఫలించినది. నావ్రతము ధన్యత నొందినది. నేకృతార్థురాలనైతి. పరులకంటఁబడకుండ నీ యర్ధరాత్రి యిందుండి నా నాథునిగూడి మార్గముఁ బట్టెదగాక.

[ప్రవేశము దొంగ]

ఇయ్యాలకి మూఁడురోజులనుంచి యేడదిరిగినా యాంలేదు. కారణం యేందో తెల్దు అన్నింవున్నం యేంయెరుఁగ అంకాళమ్మను పోలేరమ్మను, గంగాలమ్మను, మాలచ్చుమమ్మను, అంకమ్మను, మరిగత్తె పోతరాజును అందఱికి మొక్కేవత్తుండాను. నేను మొబ్బేట కొచ్చి యున్నడిట్టా వూరకేనూ లేదబ్బా! యీ మూడురోజులనుంచి ఓరిమొగం సూత్తుండానోగాని మొబ్బేట దొరకటంలేదు. అసలు నేను దొంగల్లో మొనగోణ్ని నేపుట్టినగడియే అనుమంటిది. మిట్ట మద్దేల జాంపొద్దు కాడ పొద్దుగూకేల, జాంపొద్దుపోయి మరిగత్తెఅద్ద



శ్రీరస్తు

# కాంతామతి

## చతుర్థాంకము

### ప్రథమరంగము—అడవి

[ప్రవేశము దొంగ, వానివెంట కాంతామతి]

దొంగ—(అరణ్యమధ్యంబున నిలిచి మాటలాడకుండును.)

కాంతా—ఏమిది నానాథుఁడేయని మోసపోతినే! అయ్యో యెంత గ్రహచారము! (అని వణఁకుచు దొంగనుజూచును)

దొంగ—(కదలకుండ గ్రుడ్లుద్రిప్పుచు నిలిచియేయుండును)

కాంతా—(భయముతో) అయ్యో! ఇదియేమి! నా ప్రాణేశ్వరుఁడని నమ్మి మోసపోతినే! హా! దైవమా! ఇఁకను నాకడగండ్ల గట్టుపట్టింపక బాధించుచుంటివా!

దొంగ—(పైరీతిగానే యుండును)

కాంతా—(భయముతో) చూచుటకు నల్లగ నొక మొద్దు రీతిగ గన్పట్టుచున్నది. ఇదేదైన యడవిమృగమైయుండునా! అడవి మృగమైన నిట్లేల నిలచియుండును! కాదుకాదు (పరల జూచి) అడవిమనుష్యుఁడై యుండునా! అడవిమనుష్యుఁడైన వికారరూపము గనుండఁడా! ఆఁ స్ఫురించినది. కొరవిదయ్యములు నల్లగనుండునని యు,

దొంగ—(స్వ) తొలింబరంగ నన్ను చూసి పేణేశా! అన్నది నానంతసోగ్గా వుండాగామాల్నా? కామించె నాసోకు నాటాకు. నా టేకు నన్ను మోహించి పేణేశా! అంటూ నా యెంబడి పడ్డది నాకు త సోగ్గా వుండాగామాల్నా?

కాంతా—ఓరీ! నీ పెనిమిటెవ్వఁడు?

దొంగ—నేనే.

కాంతా—నేనే నన నెవ్వఁడవో వివరముగఁ జెప్పుము

దొంగ—అయ్యో! నే నెవ్వరో తెల్లు

కాంతా—బ్రాహ్మణుఁడవా? పోనీ నీవర్ణము

దొంగ—నావర్ణము నీలవర్ణము.

కాంతా—(స్వ) సరి సరి యితని బుద్ధి యీవిధ మన్నందుకు సరి పోయినది. (ప్రకాశముగా) వర్ణమనగా కులము తెలిసెనా?

దొంగ—అట్లా సెప్పరాదూ? మరి ముబ్బేటకులం

కాంతా—ముబ్బేటకులమనగా నేమి సరిగా జెప్పుము!

దొంగ—అయ్యో! ముబ్బేటకులమం టేను.

కాంతా—నీవృత్తి యేమి?

దొంగ—ఇదే.

కాంతా—ఓరీ! ఇంక నీత్రోవన నీవుపొమ్ము. అధికప్రసంగ ముతోఁ బనిలేదు

దొంగ—ఇదిగో! మరిగత్తె పేణేశా! అని నన్ను మోహించి నాయెంటబడి యిప్పుడేడెల్తావ్? నన్ను పెళ్ళిచేసుకోవు?

కాంతా—నీకుఁ గావలెనా? నీ రూపమునకుఁ బెండ్లియే తక్కువనుమా?

దొంగ—తక్కువో! యెక్కువో! నన్ను పెండ్లి సేసుకుం టావా లేదా!

శాంతా—ఓరీ! నీకొక్కమాటఁ జెప్పెద వినుము (స్వ) వీని బారినుండి యెట్లుగా తప్పించుకొందును? ఏమియుఁదోఁచుట లేదే?

దొంగ— యేంటది? సెప్పు సెప్పు యింటాను.

శాంతా—పెండ్లి సేసుకొనుటకు నీకును నాకును భేదము కలదు. అందుచే కుదరదు.

దొంగ— భేదం అంటే.

శాంతా—నల్లనియావునే చూచుట కసహ్యముగ మలిన వస్త్రములతో నుండు నీకెట్లుగా పెండ్లియగును?

దొంగ— నాకంటె సోగ్గావుండా వేం? యిద్గో మాటిను.

కీర్తన

సల్లో దస్సై తేను నాకెమని అంతారు! నామాట యినవేపిల్లా చక్కానిపిల్ల నామాటాయినవేపిల్లా!

హాయ్ హాయ్ చీరాము లెట్టుండలే? చెప్పవే పిల్లో చీతమ్మ యెట్టుండనే?

పిల్ల పిల్ల పిల్లో కుక్కమూతి యెట్టుండనే? చెప్పవే పిల్లో చెప్పవే పిల్లో? రుక్మినమ్మ యెట్లుండనే?

శాంతా—నీకు నిజముగా పెండ్లి కావలెనా? అట్లయిన షోకుగా ఉండవలెను. మంచిద్రస్సులు వేసుకొని బంధుసహితముగా రావలె.

దొంగ— బందుచయితం అంటే

శాంతా—చుట్టాలతో గూడా

దొంగ—అట్లాగే పిల్చుకొత్తాగాని నుద్వేల్లాయేమి యెత్తే!

శాంతా—వెళ్ళనుగాని మంచిద్రస్సులతో గూడ రావలెను.

దొంగ—మంచియిలేయే నాకు.

శాంతా—ఇకపోయిరమ్ము.

దొంగ—మెల్లాయేమె?

కాంతా—నేనచ్చటికి పోయెదను, నీకొఱకై యిచ్చటనే యుండెదను శీఘ్రముగ రమ్ము

దొంగ—నువ్వెల్లాయేమె ఇదిగో నీపేరేంది సెప్పుమరి?

కాంతా—రాజాధిరాజ సార్వభౌమ ప్రతాపసేనరాజేంద్రుని దేవేరియగు కాంతామతీదేవి.

దొంగ—అబ్బో! అంతపెద్దదా! నాకు రాదు సిన్నదిసెప్పు!

కాంతా—ప్రతాపసేన రాజేంద్రుని భార్య కాంతామతీదేవి

దొంగ—బాబో! యింకాపెద్దదే యింకోటి సెప్పు!

కాంతా—సరే కాంతామతీదేవి

దొంగ—ఊహూం! యింకా సిన్నది!

కాంతా—కాంతామతి.

దొంగ—అది నాకురాదే!

కాంతా—నేఁ జెప్పెద పల్కుము కాంతామతి ఒక్కొక్క యక్షరముఁ జెప్పును.)

దొంగ—(పైరీతిగాఁ బల్కును. కొంతసేపటికి వ్రేళ్ళులెక్క పెట్టుకుని) కంత కంత కంత యింకరాదు

కాంతా—పోని యట్లనే పిలువుము.

దొంగ—(స్వ) కంత కంత కంత యిదిగో యిదిగో మెల్లాయేమె.

కాంతా—నేనచ్చటికి వెళ్ళెను నీవు మాత్రము తొందరగా రావలెను.

దొంగ—మెల్తుండ పోతుండ మల్లొత్త మాయెల్లాయేమె

కాంతా—అబ్బ! పొమ్ము నమ్మరా! నమ్మకున్న నీకింతియే

దొంగ—మెల్తుండపోతుండ మాయెల్లాయేమెఅట్టా కాదు. నేగిరిగీసిమెల్లా (కాంతామతిచుట్టు గిరిగీసి ఉమ్మివేయుచు పోవఁ బ్రయత్నించి) ఇదుగో! మెల్లా పోతాను పెల్లమాక నానివ్వ దేవత్తా.

(నిష్క్రమించును)

కాంతా—అబ్బా! వీనిబాధపడలేక విసిగిపోతిని వీనినిజూడ గవ్వను, నాగతిదలంచ దుఃఖమును వచ్చుచున్నది. (అటునిటుజూచి) నేనింక యిందు నిలువఁజాలను మరల నా మాధవుఁడు రాగలడు. వాడు రాకమున్నె వేరొక స్థలమునకుఁ బోయెదను హా! దైవమా! ఎట్టియి క్కట్టులఁ బెట్టుచుంటివి?

[పునఃప్రవేశము అరణ్యమున దొంగ వాని బందుగులు మేళముతో]

1. అన్నా! మా వదినేదీ?

2. మామా! మా అత్తేది?

3. బావా! మా అప్పేదీ?

4. తమ్ముడా! మఱదలేదిరా!

దొంగ—యహై! ఉండదిలే అరవమా కండక (బందుగులందఱు కలసి పాటలు పాడుచు పంచరంగులు దెచ్చి ముఖమునకు, శరీరమునకు రాసెదరు)

1. అన్నా! మావదినె యెక్కడనున్నదో దీసుకరా!

దొంగ—అల్లదుగో! ఆపొదచాటున కూకొన్నట్టే నెయ్యి మట్టి లాక్కురా పో.

1. (పోయి చూచివచ్చి) ఎల్లిగ మల్లిగ పుల్లిగో! అంతా పుత్తరేదో దొంగెదవ మన్నికూడా తీసుకొచ్చాడు. (అనికొట్టును)

అందఱు—యెదవా! అబద్ధాలుసెప్పి పిల్సుకొత్తావా (అని కొట్టి నిష్క్రమింతురు)

దొంగ—గంతా! ఓగంతా! ఓగంతా! అని యేడ్చుచు నేతల్లె మ్మ చిగ్గొయ్య మాయమాటలుసెప్పి మంచిదెరువు వేసికురామని సెప్పకుండలే, నిన్ను యడవిలో పట్టుకోక పొయ్యాన శే నేదొంగ నేదొంగనేనా! మరిగత్తె పిన్నె నేనా! యెల్లా ఇళ్ళిసేసుకొత్తా.

(నిష్క్రమించును యవనికజారును)





శ్రీ

# కాంతామతి



## పంచమాంకము



ప్రథమరంగము — అడవి. మఱొకభాగము

[ప్రవేశము కాంతామతి విషాదముతో]

[అనుబంధము 15]

అయ్యో! నేనెంత పాపురాలను!

చ. వెలయఁగ మున్ను దంపతుల ♦ వీడఁగఁ దెంపులు పెట్టబట్టి భూ
తలమున నట్టిపాపఫలి ♦ తంబొగి నే ననుభావ్యమందితిన్
నిలువఁగ నీడలేక మఱి? ♦ నీళ్ళను, కూడును లేకసర్వదా
యిలఁ జరియించుచుంటి నిఁక ♦ యింతలుఁబద్ధన టంచెఱుంగనే

కట్టా! దైవమా! ఇంతవరకు ముప్పూరచేఁ బడరానిపాట్లు పడి తిని. ఇఁక ముందైన నాకష్టములు గట్టుపట్టునా! ఏమి నావెడఁగు! నాయట్టి నిర్భాగ్యురాలికిఁ గష్టములు తొలగునా! కల్ల నే ధన్యురాలనే యైన నాపతి చెంతనే యుండుదాననుగదా! ఇట్టికష్టములకేల లోనౌదును.

గీ. భాగ్యహీనను గాఁబట్టి ♦ పతిని వీడి
కుంది కృశియించుచుంటి ♦ నాడెందమందుఁ

గటగటా! కాననముల నా ♦ కంజజాతుఁ
డుండుమని వ్రాసెఁగాఁబోలు ♦ నొప్పిదముగ
మూఁడుపంక్తుల నుసుటను ♦ ముదముతోఁడ.

హా ప్రాణనాథా! నీ సుందరవదనారవిందము జూచుభాగ్య మీజన్మమున నిర్భాగ్యురాలనగు నాకు గలదా? కల్ల. మందభాగ్యురాలనగు నేనెట్టి పాపములొనర్చితినోగాని యెందుఁజూచిన నన్నియు నశుభములే ఎందుఁబోయిన నన్నియు సంకటములే ఇంక నేనేమి సేయుదు! హా! ప్రాణేశ్వరా! నీప్రియకాంతను గానరావా?

ఉ. నాథుని మెట్టినిల్లు మఱి ♦ నాతలిదండ్రుల సోదరాదులన్
మోదముఁగూర్చు నాసఖుల ముచ్చటలాడెడు రాజకీరమున్
నొందయివంబు జాలక న ♦ హా! విడనాడి యహర్నిశంబు లీ
బాధలనందనాయెనిఁక ♦ ప్రాణముపోవుట యెట్లు? దైవమా!

హా! నిర్భాగ్యురాల నిర్భాగ్యురాల (ముందునడుచును)

[ప్రవేశము! రాకుమారు లిద్దఱు నొకవైపున]

1 మిత్రమా! నీ కన్న నెక్కుడు మృగముల నేనే సంహరించితిని.

2 ఇట్టి యనృతము లాడకుము, నీవామృగములతోఁడఁ బరుగిడఁజాలకుండుటచే ప్రతిమృగమును నేనుగదా కోలంగూల్చినది?

1 వీని కేమిగాని యటుఁజూడుము.

2 ఔరా! ఏమి దాని యొయ్యారము? నామనముత త్తరించుచున్నదే?

మ. అరవిందంబులు జూడు కన్గవలు నీ ♦ లాభ్రంబ నాముంగురుల్
శరదిందుప్రతి బింబమా ముఖమరే! ♦ సర్వాంగ సౌందర్యమున్
యరరే! వర్ణనసేయఁజాలనుబళీ! ♦ యీయింతి సింగారమున్
ధరలో నెవ్వతెకైననుండెనె! సఖా! ♦ తథ్యంబునూహింపుమీ,

1 మిత్రమా! ఏమీ దానిసోయగము? ఔరా! ఎంతవన్నె లాడి?

సీ. కమలజారికి కళం ♦ కము గలకంచని
యొకసక్కెమాడు నీ ♦ సకియ గాము
కంబుబింబునకు సో ♦ యగముస్థిరంబను
నిరసించు నీకాంత ♦ నీటు కనుల
కుంద కుట్మలములు ♦ కుదురుగా లేవని
యదలించు నీతన్వి ♦ రదనపంక్తి
చక్కవలాకృతి ♦ సరసంబు లేదని
సైగఁజేయుఁ బోలంతి ♦ స్తనయుగంబు

గీ. నిట్టి శుభరూపలావణ్య ♦ మింతులందు
జూచియుండను జూడను ♦ జూడఁబోను
నీశుభాంగినిఁ జేపట్టు ♦ నిహము పరము
గలదుపురుషులకరయంగఁ ♦ గలియుగమున.

సఖుఁడా! దానిమాటలాడించి చూతము రమ్ము రమ్ము. (దాపుఁజేరి) చెలీ! నీ వెవ్వరిదానవు? ఒంటిగ ఘోరాటవులం ద్రిమ్మరు కారణమేమి? నీ పుసఁ డెవండు? సర్వముఁ దెల్పుము?

కాంతా—అన్నలారా! కర్మవశమున నీయరణ్యములఁద్రిమ్మరుచుంటి నావిచారణ మీకేల! మీ మార్గమున మీరుపొండు.

2 (కనుసైగఁ జేయును)

1 చెలీ! నీ కథయొల్లఁజెప్పక దాచితివి కానిమ్ము వంటయింటి కుందేలువలె మాచేఁ జిక్కితివి ఇంకెందుఁ బోఁగలవు!

(అనుబంధము 16)

2 సీ. నినుఁ గాసి నేనింక ♦ నిలువజాలను బాల!
కోరికఁదీర్చవే ♦ కుందరదన!

1 కనకాంగి! నీ నీటుఁ ♦ గన్గొన మదికి సం
తాపమాయె నిఁకెట్లు ♦ తాళుదకట
2 సరసిజనేత్రి! నీ ♦ సౌందర్యమారసి
నంతఁ గలఁకఁ జెంది ♦ తబ్జపాణి!
1 సతులవనేకుల ♦ క్షితితలంబునఁ గంటిఁ
గాని నిన్బోలిన ♦ కాంతఁజూడ
2 గీ. మోవిచక్కెర రుచిఁజూపు ♦ ముద్దుగుమ్మ!
1 నీకు కౌఁగిట ననుజేర్పు ♦ నీలవేణి!
2 మదనిదాడికి నోర్వ నో ♦ మందయాన!
1 నన్నుఁ గరుణించి ప్రోవవే ♦ వన్నెలాడి!
2 కలికీ! మా కోరికఁ దీర్పవిదే నిన్ను విడుచుట కల్ల.
కాంతా——హరిహరీ! (చెవులు మూసికొని) ఎంతమాటాడితిరి.
శా. అన్నా! సోదరిగా నెమీకు భవదీ ♦ యాంధ్రుల్ దగన్ గొల్చెదన్
సన్నీరీతిని గోరగాదగునె? యు ♦ న్యాయంబుగానిట్లు, గా
కున్నన్ మీకిలఁ దోడబుట్టువులు లే ♦ రో? వార లిట్లాగ్రమం
దున్నారో? యది జెప్పుడీ? పిదప మీ♦దుర్వ్యశ్వరుల్ గారొకో?
మీరు రాజవంశజులు గారా? ఏమోనబ్బ! రాచవారైన వారిలో నింత జ్ఞానహీనులుందురా? లేకేమి? కొందరు వావివరుస తెలియంగని పశుప్రాయులుగలరు. రాజకుమారులారా! మీకీ బుద్ధి తగదు. మీత్రోవను మీరుపొండు. పాపము చాలశ్రేమపడి మంచి నీతి నేర్చితిరి. మీకు నీతిఁ జెప్పువారు లేరా? మీ పెద్దలకును నిదియే వడువడియా? ద్రోహులార!
1 కాంతామతీ! వేయిమాట లాడువారముగాము, ఎట్లైన నంగీకరింపక తప్పదు. లేకున్నఁ గుక్కుటమురీతియని యెంచుము. ఇంక బాగునేయక వేమ్ము. ఆ పొదరింటికడకు పోవుదము.

కాంతా—

గీ. పరసతులపొందు భువిఁ గను ♦ పాపమనుచుఁ
చెప్పియుండరె? యాజ్ఞ్యవల్క్యాదు ♦ లెనటుగార!
దుష్ఫలముగ బ్రాఁదు మిణ్ణాక్రిని ♦ నాయమూర్తముగు
బొందు టెంక్క జేగెను ♦ స్రోష్ఠవోదా.

2. ఇందువదనా! పరసతులపొందు పాపమని యెందు వ్రాసి యుండినది? చూపఁగలవా? ఉండెనుపో తెలివిహీను లెవ్వరో వ్రాసి నదిగాని, తెలివిగలవారలు వ్రాసినదిగాదు.

కాంతా—అవును. వారు తెలివిహీనులు, మీరు తెలివిగల వారు. కనక నేనితిశప్పక సంచరించుచున్నది. ఎవ్వరైన తెలివిహీను లుండిన మీ తెలివిని బోధించి మీయంత బుద్ధిమంతులుగఁ జేసి, మీ వెంటఁ ద్రిప్పుకొనుచు యశోపార్జితమును.

1. గీ. మాటలేల? ముహూర్తమునకి ♦ మరుని కేళిఁ
తేల్చు నన్నింక జాగేలఁ ♦ దేవ వమిన్న (పట్టుకొనబోవును)

2. వానిమాటలకేమి లే! ♦ వనరుహాక్షి
నన్నుఁగూడిన వేవేగ ♦ నిన్నుఁగొలుతు (పట్టుకొనబోవును)
కాంతా! నన్ను వివాహమాడుము నీ కెందును లోపము లేదు

1 తన్వీ! నన్నుఁ జేపట్టుము నీకు సర్వాధికార మొసంగెద.

కాంతా—(స్వ) వీరికెన్నినీతులు జెప్పినను వినక నన్ను భంగపెట్టనెంచిరే? కానిమ్ము. వీరిని కపటోపాయమునఁ దప్పించు కొను నుపాయముఁ బన్నెద (ప్ర) రాకుమారులారా! మీకు నిజ ముగ వివాహము కావలెనా!

1 నాకుఁ గావలెను.

2 నాకుఁ గావలెను. (మొదటివానిని నెట్టును)

కాంతా—రాచకున్నలారా! మీరు బాల్యవయస్కులు నే నన్నన్నో పెద్దదానను మనలకు వైవాహికం బెట్లుపొసగును!

1 కాంతా! నీకన్న నేనే పెద్దవాడను చూడుము.
(అని మీసము నును జూపును)

2 తరుణీ! నీకన్నను వీని కన్నను చాలా పెద్దవాడను. నీవు విచారించి మరి పెండ్లి యాడుము. (మొదటివానిని నెట్టివేయును.)

కాంతా—ఔరా! మంచియుక్తవయస్కులు నాకు లభించిరి. అతడు బాలుడు నీవు వృద్ధుడవు. మంచిదాంపత్యము. మీతోడి దాంపత్యము కడు సౌఖ్యముగనుండును. చాలుచాలు పొండు (పోఁ బోవను ఆ కుమారుల కష్టమువచ్చి నిర్బంధింతురు.)

కాంతా—(స్వ) వీరలనింక కపటోపాయమునఁ దప్పించుకొన వలయును. (ప్ర) యువకులగు నోవీరులారా! మీకు నిజముగ నాపై ప్రేమయున్న నేనొక్కటిఁజెప్పెద అందుల కంగీకరించి మీరట్లొనర్ప వలయు నట్లుచేసెదరా?

1. అట్లు నేజేసెద.

2. నీయిష్టమగునట్లు నేముందు జేసెద.

కాంతా—అట్లయిన ముందు మీమస్తు లిందుంచుఁడు.

1, 2 యిదిగో! ముందునావి (విడచి క్రిందనుంతురు)

కాంతా—ధనప్రాణములఁగూడ నిందుంచుడు.

1, 2 ఇదిగో! ముందునావి (ధనవ్రులఁగూడ క్రిందపెట్టును.)

కాంతా—ఇంకవినుండు. నన్నుఁ బెండ్లాడఁ దలంచుకొన్నది నిజమేగదా.

1, 2 నిజము నిజము.

కాంతా—అట్లయిన వినుఁడు. ఈశరమును రివ్వున వేసెదను. దాని ముందుగ నెవ్వరు తెచ్చిన వానిఁ జేపట్టెదను. ఇదిగో బాణము విసరుచుంటిని (బాణముఁ దీసికొని ఒకవైపునకు విసరి వేయును. కామూరులు పరుగెత్తుదురు) మొన్నఁబుట్టి నిన్న కన్నుల దెరచి వారికిఁగూడ భార్య గావలసివచ్చె కలికాలమే లోకమెల్ల

యుష్ణవ్యాధులు వ్యాపించి నానాట క్షీణించి కడకు మృత్యువాతగుచున్నారు. తమ దేహాపటుత్వము తా మెఱుంగక సంచరించు నిట్టిమూర్ఖుల గతు లెట్లుండ వలెనో యట్లనే యుండును. మరచి నాకు ఆమూర్ఖులగాక మున్నే యీదుస్తులను ధనువులను ధరించి పురుష వేషమున ముందు మార్గము బట్టెను.

(దుస్తులను, ధనువును దీసికొనిపోవును.)

[పునఃప్రవేశము—రాజకుమారులు అదేస్థలమున]

1 (చూచి) అన్నా! ఎంతమోసగించినది! ఎన్నో నమ్మికలఁ జెప్పి నమ్మించుటయేగాక దుస్తులను ధనువులఁగూడ గొని చనెనే! కనుకనే స్త్రీజాతిని విశ్వసింపఁదగదనియు, గంతముఁగోసినను నమ్మరాదనియుఁ బూజ్యులగు పెద్దలు నుడివియుండిరి.

2 అన్నా! ఆకాంతను వెదకి నీవే చేసికొనుము.

1 నాకేమియు వలదులే, వెదకి నీవే చేసికొనుము.

1 మనగతి పెండ్లి వలెనే యున్నదిలే! మనదుస్తులతో సహా గైకొని పోయినది. ఇఁక మనమెట్లు పురములోనికిఁ బోవుదము! దుస్తులులేక పురముఁ జేరితిమేని చూచువారెల్లలు మనల వింతగఁ జూచుటయేగాక, దుస్తులనెవరో గోల్పోయిరని గోలపెట్టెదరు, కాన నెట్లయిన కాంతను వెదకుదము రమ్ము.

1 అన్నా! మదాంధకారముచే మనము కాంతామతిఁ గోరుట చేతనేగదా మనకిట్టి కష్టములు గల్గినవి! పరనారులను గోరుట పాపమని నుడివియే యున్నది అన్నా! ఆపాపమిప్పుడు మనపై పరిణమించినది. ఇంకను నుదువులఁ దెచ్చుటకై యీనారిపోయిన మార్గముఁబట్టి పోవుదము రమ్ము. మన గ్రహచార దేవత యిట్లు చేసినదిలే.

(నిష్క్రమింతురు, యవనిక జారును)

## ద్వితీయరంగము—ఉద్యానవనము

[ప్రవేశము—కాంతామతి పురుషవేషమున శయనించియుండును పుష్పముల గోయుచు చంద్రరేఖయు నొక చెలికత్తెయు నొకవైపున]

(అనుబంధము 17)

చెలి—సఖీ! చంద్రరేఖా! నేటికి వచ్చిన పురుషసింహుఁడు నీకుగదా లభించినది? అహహో! అలతాకుంజములచెంత శయనించియుండిన సౌందర్యమూర్తి జూచితివా?

చంద్ర—(చూచి) ఓసేకలీ! ఇదివఱకెందఱనో రాజకుమారుల జూచియుంటిని గాని యిట్టిసౌందర్యమున కునికిపట్టగు నవమన్మథాకారుని గాంచజాలనైతి. ఔరా! ఏమి వీని సౌందర్యము.

(అనుబంధము 18)

ఉ. కంతునికంటె, నైషధుని • కంటె, వసంతునికంటె, యామినీ
కాంతునికంటె, దత్సుతుని • కంటెఁ గుబేరునిపట్టికంటెఁ, బా
కాంతకసూతికంటె, లలి • తాకృతి నొప్పుచునుండు, మేదినీ
కాంతుఁడటంచు నాకుఁజెలి! • కాంతులుగల్గునె వేయి నేటికిన్.
చెలీ!

ఉ. వీని ముఖంబు చందురుని • వెల్వెలఁ బారఁగఁ జేయుచుండఁగా
వీనివిలోకనంబు లర • విందములన్ ముకుళింపఁజేయఁగా
వీని భుజద్వయంబు ఫణి • వృద్ధుని నొండల వంపఁజేయఁగా
వీని విలాససంపద త్రి • విష్టపసన్నుతి మాటచిత్రమే!"
మఱియు.

క. చిందమ్ములఁ గుందమ్ములఁ
గందమ్ముల గెల్చువీని • కళ రద కచముల్
కెందమ్ములఁ గుందమ్ములఁ
ఇందమ్ములఁ దనరువీని • చరణము లెన్నన్

చెలి—రమణీమణీ! నత్కాఁగాపన్నిరీతిని నీవు చెప్పినట్లివి లక్షణములచే విలసిల్లుచుండెడి ఈతఁడే నీకుఁ దగిన పురుషుఁడు.

చంద్ర—కాంతా! ఈతని సాకృతిఁ జూడ మోహసముద్రమున ముంచుచున్నయది ఇంక నీమోహంబు నే భరింపఁజాల ఇటు దిలకింపుము.

సీ. వదనప్రభూత లా ♦ వణ్యాంబు సంభూత
కమలంబులన వీని ♦ కన్నులమరె
నిక్కివీనులతోడ ♦ నెక్కసక్కెములాడు
కరణి నున్నవి వీని ♦ ఘనభుజములు
సంకల్ప సంభవా ♦ స్థాన పీఠికవోలె
వెడదయైకనుపట్టె ♦ వీనియురము
ప్రతిఘటించి చిప్పళ్ళ ♦ పై నెత్తివాటిన
రీతినున్నవి వీని ♦ మృదుపదములు

గీ. నేరిటేటిపసల్ దెచ్చి ♦ నిరజాప్తు
సానఁ బట్టిన రాపొడి ♦ చల్లమెదిపి
వదను మదనిడి చేసెనో ♦ పద్మభవుఁడు
వీనిఁ గాకున్నఁ గలదె? యీ ♦ మేనికాంతి

(కాంతుఁడు మేల్కాంచి)

కాంతలారా! మీరలెవ్వరు? మీనామమెద్ది! ఇందురాఁగత మేమి!

చెలి—ఆర్యా! ఈమె కళింగాధీశునిపుత్రి, చంద్రరేఖ. మేమామె యనుంగుసఖులము వనవిహారార్థమై యిందువచ్చితిమి మీ నామమెయ్యదో, స్థానమెయ్యదో, కులగోత్రములెవ్వియో తెలపీయ వేఁడుచున్నారము. మీకు గళ్యాణమగుగాక!

కాంతు—(స్వ) ఏమి! ఈచెలి యిట్లు భాషించుచున్నది?

(స్వ) కాంతా! రాట్కుల సంజాతుండ కుంతలపురీశుని పుత్రుండ.

చెలి—దేవా! తమనామము దెలుపఁ బ్రార్థించుచుంటి.

కాంతు—నాకులగోత్ర నామములడుగుచుంటివేల? నాతోఁ ప సంబంధమొనర్చెదవా?

చెలి—(నమస్కరించి) దేవా! యాగ్రహింపకుండు ఒకమనవి కలదు మీరంగీకరింతురేని నుగ్గడించెద.

కాంతు—అంగీకరింపదగిన దైన నంగీకరించెదను.

చెలి—(చంద్రరేఖనుఁ జూచి కన్నుగీటును)

చంద్ర—ఆర్యా! కళింగపురాధీశ్వరుండగు మాతండ్రి ముదుసలియగుటచే రాజ్యతంత్రముఁ గుశలముగ నడువఁదగు రాకుమారుఁడు లభింపమింజేసి సంతాపమందుచుండె.

(తలవంచి సిగ్గుపడును)

కాంతు—తరుణీ లజ్జించెదవేల? యిది లజ్జించుటకదనా? చెప్పఁదలచినదాని సాంగముగఁ జెప్పుము ఇందన్యు లెవరుండిరి?

చెలి—అయ్యా! ఈ రాజ్యభారమును మీ భుజస్కందముల నిడుకొని యీమెను వివాహమాడుమని యీమెకోరిక. మీరిందుల కంగీకరించివివాహమాడుదురుమని యీమెను జేపట్టవలయును.

చంద్ర—(చెలికత్తెను చాటుచేసుకొని) భూజానీ, ఇదియే నాకోరిక ఇంక నాముద్దుఁజెల్లించి నాకును యీకళింగ రాజ్యలక్ష్మికి నాథులగుదురుగాక యని ప్రార్థింపుచుంటిని.

కాంతు—సఖీ! నీకోర్కెయందొండు తీర్చెదను రెండవదాని సంవత్సరమునకుఁగాని దీర్పఁజాల, మన్నింపు.

చంద్ర—ఆర్యా! ఇట్లు సెలవీయఁదగునా? మీరిట్లుఁ దీర్పఁ గల్గిన కార్యమెద్దియో సెలవీయ వేడుచుంటిని.

కాంతు—కలికీ! నితంత్రి వృద్ధుఁడగుటచే రాజ్యభారము మోయఁజాలకుండెనని పల్కితివిగదా? నాఁడు ప్రస్తుతమందీ రాజ్యరమకు నాయకుఁడనై ప్రజాపాలనముఁ జేసెదను గాని యూరక మానములవలను నిన్నుఁ బరిణయమాడఁజాల.

చంద్ర—కారణము తెలుపుము వేడెద

కాంతు—ఏమని చెప్పుదును? ప్రియకాంతవియోగము సంభవించుటంజేసి యీగడువుఁ జెప్పితిని.

చంద్ర—కాంతావియోగము మీకెట్లుగల్గె?

కాంతు—కాలవశమున ఘోరాటవులఁ ద్రిమ్మరుచుండ నందు ప్రియకాంతను గోల్పోయి యొంటిగ నున్న జాడఁ గనుగొందమని యిట్లుద్రిమ్మరుచుంటి కానిమ్ము నీకోర్కెఁ దీర్చి రాజ్యపాలన జేయుచు నిందేయుండి నా కాంతను వెదకుండగు వారిఁ బనిచెద.

చంద్ర—చిత్తము తమయిష్టము

చెలి—అమ్మా! చంద్రరేఖా! [illegible] బాగైనదిరమ్ము పోవుదము.

చంద్ర—ఆర్యా! పురమునకు దయచేయుడు.

కాంతు—మంచిది పోవుదము.

చంద్ర—రండుపోవుదము. (అందరు నిష్క్రమింతురు)

(యవనిక జారును)

తృతీయరంగము—రాజస్థానము.

[ప్రవేశము—కాంతుఁడు ఆసీనుడై]

రాగావతార సీసము

ఆహా! యేమి నాగతి?

సీ. శంకరాభరణంబు ♦ [illegible]

[illegible] ♦ [illegible] ?

మోహనాకారిని ♦ ముద్దుమోముసుబాహు

భాగ్యమెప్పటికి ల ♦ భ్యంబుగల్గు

భూపాలచంద్ర యీ ♦ పాపబుద్ధి యిట్టి
కష్టముల్ పాల్ జేసెఁ ♦ గాదె నన్ను !
కన్నడ యేల ? యని ♦ గాచి రక్షించుట
కిది మంచిసమయ మిఁక ♦ కేల జాగు ?

గీ. తోడివారలు చాల సం ♦ తోషవార్థి
నోలలాడుచు నుండిరి ♦ యోసరిలక
నోలిమిఁ మీపాదంబుల ♦ నోలగించు
భాగ్యమబ్బెనో లేదో యీ ♦ పాపికింక.

అహా! నేనెట్టి నిర్భాగ్యురాలను ? పడరాని యిడుములఁ బడి నేటికి కపటవేషధారినై కాంతుడను పేరఁ గాలము గడుపుచుంటి

నా కపట కృత్య మెఱుంగక చంద్రరేఖ తన్ను వివాహమాడు మని పల్కుచున్నది. ఆమె సుందర వదనారవిందము గాంచినప్పుడెల్ల లక్షించుచుంటి నేఁ జెప్పిన గడువు సైతముఁ తుదముట్టవచ్చినది. నా ప్రాణకాంతుని జాడ యెందును గాన్పింపదయ్యె. ఇంక నేనేమి సేయుదాన? నాకింక దిక్కెయ్యది?

ఓ లక్ష్మీవల్లభా! లోకనాయకా! ఆర్తజనశరణ్యా! ఇంక నా నాథుని నాకుఁ జూపకున్న నీ ప్రాణములఁ బాయుదాన. ఓ జనార్దనా! కంసమర్దనా! పతిభిక్ష బెట్టి నన్ను రక్షించుమా! గరుడసైంధవా! వైకుంఠవాసా! దిక్కులేని నాయట్టి దీనురాండ్రకు నీవే గదా దిక్కు! పుండరీకాక్షా! యింక రక్షింపుము. (చూచి) ఎవడురా ?

[ప్రవేశము, సేవకుడు] అయ్యా! సేవకుడు.

కాంతా—ఓరీ! నీవింక కారాగృహము చెంతకుఁ జని యా కారాగార కుడ్యముపై వ్రాసిన చిత్రపటముఁ జూచి యెవ్వరైనను దుఃఖించినను మోహించినను నేకదృష్టి నిఁ జూచినను, వారి నెల్లర కారాగృహము నందుంచుము. ఇది యేనా యాజ్ఞ! జాగ్రత, మరచితివి ఎవ్వరేని మాని వేషధారులు వచ్చిన వారిని సన్మానించి యుచితాసన మొసంగుము.

సేవ—చిత్తము. (నిష్క్రమించును)

కాంతు—నే నించుకంత విశ్రాంతిఁ జెందఁబోయెద.

(నిష్క్రమించును యవనికజారును)

తృతీయ రంగము—కారాగృహము

[ప్రవేశము : సేవకుఁడు ఖడ్గహస్తుఁడై]

రాజులయెడ సేవకావృత్తి మిగుల కష్టతరము. కోపమువచ్చిన కోతికి చంపుదురు. లేనిచో నాకే చంపుదురు. ఎట్లయినను చావే. ఆజ్ఞ. ఈచిత్రము చూచి దుఃఖించువారిని కారాగృహమం దుంచమని. ఇచ్చటికనేకులు వచ్చిరికాని యీపటమును జూచి దుఃఖించినవాఁ డొక్కఁడును లేఁడు. ఇందుఁ గాపుండలేక చచ్చిపోవుచున్నాఁడ ఇదీపటము నాచావుకొరకే వ్రాసినారు. ఇందు నిండుండఁ గావలికి నేనే దొరకితినా?

[ప్రవేశము : ఉత్తమశీలుఁడు]

(అనుబంధము 19)

(చిత్రపటమును గాంచి) హా! తరుణీ! కాంతామణీ! మోసపోతినే!

సేవ—ఎవరునీవు?

ఉత్త—నేను వైశ్యుఁడను.

సేవ—ఈపటముం జూచి యేల దుఃఖించెదవు?

ఉత్త—అయ్యో! ఈమె యిప్పు డెందున్నది.

సేవ—కావలెనా? చూపెదరమ్ము. (అని కారాగృహమం దుంచును)

[ప్రవేశము : దుష్టబుద్ధి అనుబంధము 19]

(చిత్రపటముఁ గాంచి) హా! కాంతా!

సేవ—ఓయీ! నీవెవ్వఁడవు?

దుష్ట—నేను క్షత్రియుఁడను.

సేవ—ఈపటమునుఁ జూచి యేలదుఃఖించెదవు?

దుష్ట—ఆమె నాభార్య అందుచేత.

సేవ—ఐన నామె నీకిప్పుడు కావలెనా?

దుష్ట— అయ్యో! యెందున్నది? కావలెను చూపితివేని నీకు పారితోషిక మొసంగెద.

సేవ—అట్లైన రమ్ము. (కారాగృహమందుంచును)

[ప్రవేశము : దొంగ అనుబంధము 21]

ఆ! గంతా! గంతా!

సేవ—ఓరీ! ఏల యేడ్చెదవు?

దొంగ—గంత నాగంత.

సేవ—నీకు గంత కావలెనా?

దొంగ—ఆ కావలె, ఏదీగంత?

సేవ—ఐన రమ్ము. (వీని కారాగృహమందుంచును)

[ప్రవేశము : రాజపుత్రులు అనుబంధము 22]

(చిత్రపటము గాంచి) హా! తరుణీ! నన్ను మోసము జేసి యెందుంటివి?

సేవ—ఎవరు మీరు?

1, 2—మేము రాజబిడ్డలము,

సేవ—ఈపటముం జూచి యేల దుఃఖించెదరు?

1, 2—మాకీ కాంత కావలెను. ఎందున్నది?

సేవ—నిజముగ గావలెనా?

1, 2—కావలెను.

సేవ—ఐన రండు. (అని కారాగృహమందుంచును)

[ప్రవేశము—ప్రతాపసేనుఁడు సన్యాసివేషమున]

(అనుబంధము 23)

హా! ప్రాణేశ్వరీ! ఎందుఁటివి? (చిత్రపటమునుజూచి దుఃఖించును.)

సేవ—యతికులేంద్రా! నమస్కారము ఇయ్యుచితాసన మలంకరింపుడు.

ప్రతా—మంచిది. (కూర్చుండును.)

[ప్రవేశము — కాంతుఁడు ఒకసైపున]

కాం—(స్వ) ఈతని రూపలావణ్యాకారంబుఁ జూడ నా కాంతుని వలె గన్పట్టుచున్నాఁడు. విచారించిన సర్వము బయలుపడును. (ప్ర) తాపసేంద్రా! వందనములు. ఇంతకుఁ శ్రీకాంతిసేనుఁడు సేవకా! ఈపటముం జూచి దుఃఖించిన వారి నెల్లఁ గారాగృహమునం దుంచితివా! (ఆసీనుండగును.)

సేవ—చిత్తము.

కాంతు—ఐనవాండ్ర వరుసగఁ దోడి తెమ్ము విచారించెద.

సేవ—చిత్తము. (ఉత్తమశీలుని వెలుపలకుఁ దీసికొనివచ్చును)

కాంతు—ఓయీ! నీవెవ్వఁడవు?

ఉత్త—నేను బేరివంశజుఁడను.

కాంతు—ఈపటముఁ జూచి దుఃఖించిన కారణమేమి?

ఉత్త—అయ్యా! ఈమె వరణ్యమున నొక సేవకుఁడు విడిచి పోవుచుండ వానికి నేకొంతధనమిచ్చి ఈయమను గొంటిని పిదప నన్ను గూడుమని యామెను నే నిర్బంధించ నా మహాతల్లి నాకు బుద్ధివచ్చినట్లు నీతులఁ దెల్పినది. అంత నేనజ్ఞానము నువిడిచి సుజ్ఞానముధరించి, అమ్మా! నా ధన మెట్లువచ్చునని ప్రార్థింప నామె వ్రేలినుండి యుంగరీయకమొకటిచ్చి దీని విక్రయించుకొనుమని చెప్పినది. అంత దానిఁ గైకొని యొకరాజు సన్నిధికిం దీసికొనిపోవ నాతఁడది గ్రహించి నాకు ధనమీయక యే బారద్రోలె అంత నేను. నాద్రవ్యము పోయెనని మతిభ్రష్టుఁడనై చరించుచు నేటికీ పురముఁ జేరితిని. ఇందాతల్లి రూపపటంబు గన్పడజూచి దుఃఖించితిని. అంతియే కాని వేరేమియు నేనెఱుఁగ.

కాంత—మంచిది యతికులేంద్రా! ఇందు మీ యభిప్రాయ మెట్లుగానుండె సెలవొసంగుఁడు.

ప్రతా—ఈతఁడు ద్రవ్యముఁగోల్పోవుటచే మతిభ్రష్టుఁడనైతినని పల్కుచుండె అట్లనే జరుగవచ్చునని నాకుఁ దోఁచినది. మఱియు నామెకునీతనికి నేమియు సంబంధము గల్గినట్లు నాకుఁ దోఁచకున్నదిఁ

కాంతు—మంచిది. ఓయీ! నీవావలుండుము. సేవకా! తర్వాత వానిం దోడ్కొనిరమ్ము

[సేవకుడు దుష్టబుద్ధిని వెలుపలకుఁ దీసికొనివచ్చును]

కాంతు—ఓయీ! నీవెవ్వడవు?

దుష్ట—నేను రాజకులోత్తముఁడ.

కాంతు—రాజకులోత్తముఁడవా? నీవా పటముఁ జూచి దుఃఖింపనేల?

దుష్ట—ఆమె నాభార్యగాన—

కాంతు—(కోపముతో) నీచా! నిజముగ నీ భార్యయేనా! సత్యముఁ జెప్పుము. లేకున్న శిక్షింపబడుదువు. ఆమె యిందే కలదు. నీవసత్యముఁ బలికితివేని యామె నిందు రావించి నిజమారసి శిక్షించెద జాగ్రత నిజముగ్గడింపుము శిక్షింపబడుదువు.

దుష్ట—(భయముతో) అయ్యా! నాభార్యకాదు. ఆమె నా పట్టణమునకు వచ్చినది. అంత నేనామెను నిర్బంధించి నాకోర్కెఁ దీర్చుమంటిని. అంత నామె యిట్లుపల్కినది నేను గౌరీవ్రతము సల్పవలెను. అది సల్పుట కాఱుమాసముల యారుదినములు జరుగును. అందులకనేక దానములీయవలయును. దానికగు వ్యయము నీవొసగిన నీకేలభించెద నని చెప్పె. నేనందులకు నాబొక్కసమందుగల ధనమంతయు వెచ్చించితి పందపడి రాజ్యమునయిత మితర రాజుల యాధీనము జేసి ధనముఁగొని తెచ్చి యామె కడకుంబంపుచుంటిని ఇట్లారుమాసములు జరిగినవి తర్వాత నాకడ ద్రవ్యము సాంతమైనది ఆమెయు నాయారుదినములు జరుగకమునుపే యెందో పారిపోయినది. ఎట్లైన నామెదర్శనమైన జేతమని రాజ్యభ్రష్టుడనై యిట్లు ద్రిమ్మరుచుంటిని. యిందామె రూపపటంబు కన్పడ దుఃఖించితిని అంతియేకాని వేరేమియు నే నెఱుంగ.

కాంతు—అయ్యా! ఇందుమీయభిమతమేమి? సెలవొసంగుడు

ప్రతా—ఈతడును రాజ్యమును ద్రవ్యమును గోల్పోవుటచే నిలుపనీడలేక నిట్లుగా ద్రిమ్మరుచు వచ్చెనని నాయభిప్రాయము.

కాంతు—ఈతని విషయమై మీకేమియు సనుమానము లేదు కదా ?

ప్రతా—ఈతని యెడ దోషమున్నట్లు నాకు దోచుట లేదు.

కాంతు—మంచిది ఓయీ! నీవావలకుం బొమ్ము సేవకా! తరువాత వానిం దోడ్కొనిరమ్ము.

[సేవకుడు దొంగను వెలుపలకు దీసికొనివచ్చును]

కాంతు—ఓరీ ! నీవెవ్వండవు ?

దొంగ—నేనా ? మబ్బేటగాడిని.

కాంతు—నీవేమి చేయుదువు ?

దొంగ—దొంగతనమే.

కాంతు—నీవీ పటమును జూచి యేడ్చినదెందులకు !

దొంగ—ఇదే నేనోదొంగతనానికి పోయెతలికి మేడమీద కూకోనిప్యాణేశా! అన్నది ఆమోాయి న్నేను ఊఁ! అన్నా. ఆమోాయిని పయినుంచి దిగొచ్చింది అప్పుడు నేను మెల్లంగ అడియికి తోవతీశా ఆమోాయిని అదినాయనకే వత్తుందది అట్టపోయి అడిను ముద్దెకు తీసి కెళ్ళి ఆమోాయిని నన్ను పెళ్ళిచేసికోమని కదలకు. డ అడ్డండపొయ్యా ఆమోాయిని యేందేదోచానా చెప్పిందిఆయెన్ని నాకు తెలిపెళ్ళిచేయ

కాంతు—ఛీ! వెధవా! ఏం మోాయిని నీమోాఖం మోాయని

దొంగ—ఆ ! నీ మొఖంమోాయుని

కాంతు—ఛీ ! బుద్ధిహీనుడా ! జాగ్రతగ మాటాడుము.

దొం—మరిగత్తే ఆమోాయిని—మరిపోయ్యా కూసేవుండు.

కాంతు—ఊఁ, దగ్గరకు పోయినావు !

దొంగ—మరిగత్తే, ఆమోాయిని నీకు మంచి డెరుమల్లేవు అయ్యోనుకుని రామని సెప్పింది ఆమోాయిని నేనుమాయింటికెల్లి డెరుసు వేసుకొని మావోల్ని పీల్చుకొని బుకాయి గికాయి తీసి కొని అడిగొచ్చేతల్కి అదేకుంది? ఆమోాయ్ని.

కాంతు—(దెబ్బఁగొట్టి) ఛీ! వెధవా! త్వరగ దేల్చి చెప్పుము.

దొంగ—ఆమోయిని మాకాళ్ళంతా నన్ను దొంగెదవా! దొంగమాటలు సెప్తావా మోకని తలో దెబ్బ యేశారు. ఆమోయిని నేను యేసుత్తు అడివి బడివత్తావుంటా, యెట్లయినా దాన్ని పెళ్ళిసేసుకోవాలని. వొచ్చొచ్చి ఆగోడమీద దాని బొమ్మ కనిపించేతలికి ఆమోయిని యేసుకొచ్చి జోర్నేసి చేతలికి మీరాయిపడివ లొచ్చి నన్ను గట్టిగా పట్టుకొని నీకు దాన్ని యిత్తాం రామని సెప్పి ఆమోయని కిటికీలోకూకుండ బెట్టేరు. అందులో యీళ్ళంతా వుండారు ఆమోయిని—

కాంతా—ఓరి! తలనొచ్చుచున్నదిగదరా? ఇంక మాటాడక అవలుండుము పొమ్ము.

దొంగ—అంతా సెప్పేద్దునండి ?

కాంతా—(దెబ్బగొట్టి) అవలకుంబొమ్ము జాగ్రత. (ప్రతాపసేనుని చూచును)

ప్రతా—వీడు చోరుండగుటచే ద్రవ్యాపేక్షవలన నిట్లు మాయలంబన్నెంగాని పిశాచము యిందేమయ్యుంగపటము నవలంబించియున్నట్లునాకు దోచకున్నది.

కాంతు—మంచిది. ఓరి! నివాసబలము బొమ్మ సేవకా! తరువాత వానిం దెమ్ము.

(సేవకుండు, రాజకుమారుల నిరుపలికిం దీసికొని వచ్చును)

కాంతు—మీ రెవ్వరు ?

1, 2—మేము రాచబిడ్డలము.

కాంతు—ఇం దేల వచ్చితిరి?

1, 2—అయ్యా! కొన్ని మాసముల క్రిందట మేమిరువురము మృగయావినోదార్థమై కానభూమి కేగితిమి. అందొక తరుణింగాంచి యామెపై మోహముగలిగి యామెను నిర్బంధించితిమి. కాని యామె మాకెన్నియో నీతులు జెప్పినది ఆనీతుల విశ్వసింపక యామె పోవు మార్గము నిరోధించితిమి. అంతట యామె యిట్లు బలికినది. "ఓ రాజకుమారులారా! నేనొక్కటి దెల్పెద. వినుడు. మీ యుడుపులిందు విడిచి పెట్టుడు అన" మేమట్లు జేసితిమి.

కాంతు—మంచియుక్తి బన్నినదే? పిమ్మట.

1, 2—పిమ్మట ''యీశరమును విసరి వేసెదను. దానిముందు తెచ్చినవాని పెండ్లాడెద'' ననిపల్కి శరమును వేగముగ విసరివేసెను. అంత మేమాశరము కొఱకై పఱువెత్తిడి శరమును గైకొని వచ్చుసరికి యామెయాయుధములను రెండవశరమును గైకొని యెందో చనినది. మేమందులకుం గినిసి దుస్తులం గోల్పోయి ఘోరముం జేయుటకన్న యాకాంత యెందుంగలదో వెదకి ప్రార్థించి మరల దుస్తులగైకొనుట మేలని దలంచి మార్గముబట్టి యిచ్చటికిం జేరితిమి. ఇందామె రూపపటముం గాంచి దుఃఖించితిమి అంత మమ్ము కారాగార వాసులుగం జేసిరి. ఇంతియేగాని వేరెఱుంగము.

కాంతు—మంచిది. అయ్యా! ఇందులకు మీయభిప్రాయ మేమి?

ప్రతా—తొలుత వీరు మోహముతో దుష్కార్యమునకు పాల్పడియుం గపటోపాయమున నాకాంత దుస్తులగైకొని పోవుటచేం గాంత లభింపకున్నను దుస్తులైన మేలని తలంచి యిట్లుగా భ్రమించు చున్నట్లు స్పష్టమైనది. కాని వీరికిని యాకాంతకును సంబంధ మేమియు లేదని తేటపడినది.

కాంతు—మంచిది. సంతసించితిని ఓయీ! బుద్ధిహీనులారా! తమ మదాంధతచే కన్నులున్నగానక పిన్నపెద్దలని యెంచక పరనారులని దలంచక విఱ్ఱవీగకుండు మీపురమున కెవ్వరైన విధివశమ్మున వచ్చినవారిని నిర్బంధించి పాపమార్జింపక సద్బుద్ధికల్గి మెలంగుడు. భరతమాతను దుఃఖపెట్టకుడు. (ప్రతాపసేనుని జూచి) అయ్యా! వీండ్రవలన నేలోపము లేదని సెలవిచ్చినారా?

ప్రతా—ఏలోపమును లేదు.

కాంతు—[illegible]

ప్రతా—ఆ [illegible].

కాంతు—మంచిది అయ్యా! తొలుత కాంతుని గోల్పోయి [illegible] డంగీకరింప నేమైన సందియముండునా? ఉండినం జెల్పుడు.

ప్రతా—లోగడ మేమిచ్చిన శ్రీ జనక పాతివ్రత్యమును గాపాడు కొన్న కాంతనేల నంగీకరింపవు? అని యేల నంగీకరింపబడదు ?

కాంతు—నాథా! నిద్రాహారంబులు లేక ఇన్నికష్టములంది యీపురముం జేరి పురుషవేషమున గాలము గడుపుచున్న నిర్భాగ్యురాలగు గాంతామతిని నేనే కరుణింపుడు.

(అనుబంధము 24) (కాళ్ళపై బడును)

ప్రతా-(ఆశ్చర్యముగ) తన్వీ! నిజముగ నీవు గాంతామతివా ?

కాంతు—నాథా! తమ సెలవయ్యెనేనిఁ బూర్వరూపము జూపెద. (స్త్రీరూపమును జూపును.)

(ప్రవేశము—చంద్రరేఖ, చెలికత్తె ఒకవైపున)

కాంతా—సోదరీ! ఇట్లాశ్చర్యమునఁ జూచెదవేమి? ఇంతకాలమునుండియు,

గీ. పురుషరూపంబు ధరియించి ♦ పుడమి నేలి
కాంతుఁడను పేరఁ బరగి నీ ♦ స్వాంతమునకు
సంతసము గూర్చియుంటి బల్ ♦ వింతగాను
చంద్రరేఖ! సహోదరీ! ♦ సంగతిదియె.

నేనారు మాసంబులు గడువు చెప్పినదీ మహానీయుడగు నా ప్రియకాంతుని కొరకు మఱియు నేనిదివరకు బడిన కష్టములెల్ల నాచే నిప్పుడు విచారింపబడిన పంచమహాపాతకు లనవొప్పు నీయైదుగురి వలననే వీండ్రజూచితివా నీచాత్ములు.

ప్రతా—ప్రియకాంతా కాంతామతీ!

చ. కలికిరో! నీగుణంబులను ♦ గన్గొనలేరక వేశ్యమాటలన్
యిల నిజమంచు నమ్మిచెడి నిను ♦ వీడితి కానకుమందబుద్ధినై
భళి! యన లోకమెల్లరును ♦ బాగుగ రాజ్యము నేల దుష్టులన్
లలనరో! శిక్ష జేసితివి ♦ లక్షణవంతులు జూచి మెచ్చగన్.

ప్రియా! నేనొనర్చిన దుష్కార్యముల క్షమించి నన్ను గావుము.

కాంతా—నాథా! ఇందు మీరేమి చేసిరి? విధివశమున నిట్లు జరిగినది. మీరు చింతింపకుడు. మఱియు నీకోమలాంగి మీమృదుకర పల్లవముబట్టి సుఖింప మీకొరకై నిరీక్షించుచున్నది. ఈమెం జేపట్టి కృతార్థురాలఁ జేయఁ బ్రార్థించుచుంటిని.

చంద్ర—ఆర్యా! నన్నును యీకళింగ రాజ్యలక్ష్మినిఁ జేపట్టి సుఖంప వేడుచున్నదాన. (నమస్కరించును)

ప్రతా—రామామణీ! నీకోర్కె నెఱవేర్ప నంగీకరించెద నెమ్మ.

కాంతా—నాథా! శుభస్యశీఘ్రమ్మనున ట్లిప్పుడే శుభ ముహూర్తముఁగూడ చాపుజేరినది ఇంక జాగుసేయరాదు. సేవకా!

సేవ—(ప్రవేశించి) సెలవు.

కాంతా—సత్వరంబుఁ జని రెండు చేతాసనములఁ దెమ్ము.

సేవ—చిత్తము. (నిష్క్రమించును)

[పునఃప్రవేశము : సేవకుఁడు కుర్చీలతో]

కాంతా—నూతన దంపతులారా! ఈయాసనము లలంక రింపుడు.

ప్రతా, చంద్ర—వానిపై గూర్చుందురు.

కాంతా—(కర్పూరము వెలిగించి)

మంగళము

మానినులుభూస్థలిని ♦ మాన్యతగడించిప్రియు ♦ మంజులవచోమృతము లోల్కన్
బూనుకొనిభర్తలకు♦బూజలొగిజేసియిలపుణ్యవతు లయ్యెదరుగాతన్
జానలనుబూరుషులసంభ్రమునఁ గైకొనియుజక్కఁగ సుఖంచెదరుగాతన్
మానవతులైనరతి♦మారసములిద్దరకు ♦ మంగళము మంగళమహాః శ్రీ

(యవనిక జారును)

సంపూర్ణము

# అనుబంధములు

కాంచ— హిందుస్తాని తోడి ఏకతాళము

ఆహాహా ! యీజగతికిఁ జూడగ వేశ్యలె ధీరలుగా ? ఆ॥
ముదంబుజూపగ మోసంబుదీయగ యెడందలంచి చూడంగ ఆ॥
ధనములాగగా దగువారెవరిల తగినవారలే వేశ్యలుగా ?
ఈయిల తగినవారలే వేశ్యలగా ? యీయిల తగిన వారలే
వేశ్యలుగా ? వేషముల్ భాషలన్ వేసియున్ జాలగా ఆ॥

ప్రతా— 2 హిందుస్తాని కాఫి ఏకతాళము

కలికి మిటారీ ! కాయజు కటారీ !
అలుకాలేల నీకు ? బలుకాకనాతో ?
కాంచనమాలరో ? కడుకోపమేలనే ?
కాయజుబారికి తాళగజాల మోహనాంగిరో ! వేడెదజాల
నగ్ బాయుటకిది మేల ? సుగుణశీల యిదియేమి వినుబాల ఆ॥

కాంత— 3 డైలాగ్

వినువిను విను నీవైవాహికమున్ వినియుజేసితో వేశ్యను
వీడున్ వినకయున్న నీవు చెడకపోవుసుమి వేదవాక్యమిది
వినుమింకన్.

ప్రతా—చాలుచాలు నీసంగతి దెలసెన్ యేలబల్కెదవు ? గురువని
నిన్ని వేళగాచితిని - వెడగు మానుమిక - వెరలు బల్కనిటు
నటుకకుందునే॥ చా॥

వేశ్యలు— 4 పాట—డ్యాన్సు

మహారాజ సుగుణధారా - మముబ్రోవు సుమశరీర
గానన్ - కరుణన్ వేగన్ - మముగను (మా) ॥మ॥
నీసరి యెవరీ - భూస్థలి గనుగోన
భాసురగాత్రా ! - రసమునపవిత్రా !

వాసిగన్ - చేకొన-దగునికన్ - సీమదిన్ - రయమున ॥మ॥
మాదగుకోర్కెల - మహిదీర్చియుండి
సాదరముగ మము సాకము వేగన్ - జగదాధారా ॥మ॥

కాంతా— హిం తోడి - రూపకి తాళము

ఏమిసేతు ? దైవ ఘటన - యెందుబోదు నేనిక
కామితార్థ దైవరాయ - కనియు బ్రోవవా
నేరమేమి సేసియుంటినో ? - నేనెఱుంగనే
ధీరస్వాంత ! ప్రాణకాంత ! - దీన నేలుమా
కారగార మందు నుంచుట - కారణంబదేమిహా
నేరమున్న వేడుశిక్ష - నేర్పరించ గాదొకో ॥ఏ॥

కాంచ— 6 బేహాగ్ రాగము ఏకతాళము

ఆహా ! మామర్మముల దెలియ నెవ్వారితరమౌ నిల ॥ఆ॥
ఇలనోహాంబునో - బలువేసంబులన్ - పడివేయుచుగా
ధనమార్జించగన్ - కాముకుల ముంచుచును - కాలంబు
గడువుదుంగదా ?

కాంతా— హిం. తోడి—రూపక తాళము

నాథా ! గుణహీనబాధా ! సైపగ లేనే ॥నా॥
చెరసాలలో నన్ను జేర్చి బాధించితో
పరగ వనములకంప - భావ్యామె నీకిది ॥నా॥
ఎటుబోదు నేనింక ? యెవరింక దిక్కయ్యో ! ॥నా॥
కటకట ! నాకిట్లు - గల్గు నంచెఱుంగనే ॥నా॥
తల్లిదండ్రులునమ్మి - యుల్లము హర్షింప
కల్లమాటలఁదెల్పి - యిల్లాలి కీపాట్లు ॥నా॥

ఉత్త— జైలాగ్

మోహము, దీర్పా కెందుబోయెదనే ? కల్కిమితారీ ! కంతుని
కటారి ॥మో॥

కుందరదనా ! యిందువదనా ! మందగమనా ! వినగదే సుందరీ!
నిన్ - విడువఁజాల - పొందకుండ నేనిఁకన్ ॥మో॥

కాంతా—చాల్ చాల్ నీచా! సరసముదెలసెన్ - సఖూ
లను గోరదగునా ఛీ

పరనారీమణులగోరగా - దురితమా - నరకమా - దెలియవా?

ఉత్త—దురితము నరకమదెందుంగలదే దూరమునుండెద
వేలనే? బాలా.

కాంతా—సరసులి కదియున్ - సరగున దెలియున్ - చాల్
చాల్ ఛీపో! సరగునీచా?

ఉత్త—సరసుడనేనే - విరసము లేలను? సరగున చెంతకు రారా॥

కాంతా—దురితము కామ్యము - దూరము నుందుము -
దుష్టుడ ఛీఛీ పో!

దుష్ట—చాల్ చాల్ నారీ! యో రాజకుమారీ!

కాంతా—ఏలను ఛీ పోరా నన్నిటు కోరితి రా.

దుష్ట—సఖి వినవా?

కాంతా—ఓరి నీవు మానవా?

దుష్ట—పరహింసలు - కాంతరో పాపముగదా ? యిల

కాంతా—పరనారిని గోరుట - పాపముగాద? ధర

దుష్ట—పరసఖివాదువా

కాంతా—క్రూర నీవెటుఁగవా?

దుష్ట—సరి సరి కాంతా! సరసకురావా!

కాంతా—సరసమదేరా! సరగునపోరా?

దుష్ట—నారీ! వయ్యారీ! చిన్నారీ! మిఠారీ!

కాంతా—యేలను ఛీ పోరా! నన్నిటు కోరితిరా!

దుష్ట—చాల్ చాల్ నారీ! యో రాజకుమారీ!

ప్రతా— 10 బేహాగ్ రాగము-ఆదితాళము

వేశ్యలఁ గూడుట వెడలగునండీ - వెడగుమానుడిక - విటులందరును ॥వే॥

మోహముఁజూపించి - ముద్దులు దినిపించి - మంచియే తేల్చరుగా! విటులన్ - మంచియు తేల్చరుగా ॥వే॥

మాన్యములమ్మించు - రాజ్యములమ్మించు - యిల్లూ వాకిలీనున్నా - విటుల యిల్లూ వాకిలీనున్నా ॥వే॥

దాసునిగా జేసి వాసియు దిగగోసి - వరుసగ క్షౌరము జేయున్ - వేశ్యలు వరుసగ క్షౌరము జేయున్ ॥వే॥

కాంచ— 11 10 పాటయే

ప్రతా— 12 హిం॥ తోడి ఏకతాళము

అకటా! ఎటగాంచెదను? నాప్రాణేశ్వరినే ॥ప॥
క్రూరుడ నయ్యానే - ఖాంగదోలితి
నారినివనమునకు - గురుపాపుడనై ॥యు॥
మానిని యెందైన - మనితివాలేదాకో?
కానన మృగములు వే - కనిబ్రింగె నేనిన్ ॥న్న॥

కాంతా— 13 ఫీలు ఏకతాళము

కరుణజూపవా? నాథా! వైరివినాశన
ధరణిపాల వందనీయ - తరుణి బ్రోవవా?
కాంతామతి—కీకష్టముల్
కడఁదేర్పరాను? నాథా!
కష్టదశలలోననుంటి బ్రోవరావే ॥క॥

ప్రతా— 14 హిం॥తోడి—ఆదితాళము

అయ్యో నాకాంతామతి! కాంతామతి! పోయెను హా! హా!
పాపున నేనిల
పడరాని పాట్లనొన్నై పట్టికిడియు

పంపియుంటిని కానలకు పాపమనక
బాల యేలీల నుండెనో? కానలందు
వేశ్యచే నిల్లుగళ్లైగా వెతలునాకు. ॥అయ్యో॥

కాంతా— 15 హిం॥ తోడి ఏకతాళము.

అకటా! యెటుదోచునుగా? యీగహనానమున - జన ॥అ॥
నాథా! యీగతి - బాధలనొందెదు - నన్గని బ్రోవవుగా?
మానసమున.
క్రూరులు నన్గని మారుని బారికి - సారెకునందుచునూ॥
దరి జేరగవా.
మారశరీరా - మహితవిచారా - మనగలనే? ధీరా
నిన్ గనకనిల.

1, 2 రాజకుమారులు 16 జెలాగ్

1 రాజ॥ చెలియనీవు కౌఁగిలొసగి - చెంతఁజేర్పరాగదే? ॥చె॥
కలికీ యామరుతూపుల - కిలను తాళజాల నింక
చలమేలను - ననుచేకొను - జలజానన! మందగమన ॥చె॥
కాంతా—చాలునుపో యిబ్బా! నీసరసమెల్ల దెలిసెనుతూ ॥చా॥
పర తరుణుల నిటుగోరగ - పాపమనుచు దలపవా? ॥చా॥
2 రాజ—చానయిటు బల్కనీకు - సరసముగునె దలపుమా?
కానమున్నిధలగల కామకోటి తన్పినట్టి
మానసీచరిత్ర కొండు - మాయా! [illegible] కానిమ్ము! ॥చా॥

చంద్ర 17

కొమ్మఝుంఝుమ్మను తుమ్మెదరొలదవిని
నిమ్మళించ లేనెమది - యాహాహా
చూడచూడనిటు చోద్యమయ్యెనాకు సుందరాంగియిదివిన
కనగన్ యింపుగాన్ - సొంపుగాన్ - పెంపుగాన్ - ఆహా
యుండెనుజూడుము యిలతలc

చెలి—కీర శారికా కిలకిలరవములు - కీరవాణిబల్ తీరుగ నుండెను,
కోరికమన్మథుఁడు - జేరిబాణముల - నారీమణులపయి నడపె
నాయగా ?
కూయసాగెc - కుతుకముతోడన్
చంద్రవదనా! సుందరనయనా! ॥కీ॥

చంద్ర—ఈయుద్యానము - యింపుగనుండెన్ - యిందిరాక్షిరో!
యిదె నీవుగనుమా ?
విరులసొంపు తరులపెంపు నారులకింపు బారులసొంపు ॥యీ॥

చంద్ర— 18 హిం॥తోడి—ఏకతాళము

ఆహాహా! యీయువకునిసరియగు పురుషునిగంటిమ ? వహ్వ
వహ్వ !
కంతు జయంతు వసంతుల మిగిలెడి - కాంతరో! వీనిపైc
గ్లెన్ కాంక్షల్
పూర్ణిమచంద్రుని గేరెడిమోముc - భుజములు గిరులన
బొలెన్ గనగన్.
కర్ణము లెంచc - శ్రీలనుమించెన్ -కనులను గాంచన్
కమలములనగన్. ॥ఆ॥

19 ముఖారి—ఆదితాళము

ఆహా! కనుపడవై...తివ?
కానలోనిన్నునే కనుగొని యుండితి
చానరో! నిన్నుఁగాంచ జాలను నేనిం ॥ఆ॥

దుష్ట— 20 ముఖారి—ఆదితాళము

ఆహా! కాంతరో! కనుపడవై...తివ?
రాజ్యముఁ గోల్పోతి రామరో! నిన్నని
వ్యాజమునన్నిటు వ్యర్థుడనైతిగా ॥ఆ॥

దొంగ— ముఖారి—ఆదితాళము

యాడపోతివే? ఓ ఆడమిడిశా యాడపోతివే?
పెళ్ళిసేసుకుంటాననీ పారిపోతివే! అడమడిశా! ॥యా॥

1, 2—రాజకుమారులు 22 ముఖారి—ఆదితాళము

ఆహా! మానినీ! కనుపడవై...తివ?
కమ్మనముతో మమ్ము సమ్మతిపరచి
కొమ్మరో! దస్తుల కోనిచనియుంటివి?

ప్రతా— 2 ముఖారి—ఆదితాళము

హా కాంతామతీ. కనుపడవై...తివ?
నిన్ను నేగోల్పోతి నిముసములోన నే
నన్ను తాంగిరో! నే - నిన్నిఁకగాంతునా? ॥హా॥

కాంతా— 2. మోహనరాగము—ఏకతాళము

కరుణగాంచి - కనికరించి బ్రోవుమానాథా!
పడితి కష్టములెన్నో నేను - బ్రతుకనేల? ప్రాణనాథ
కడకుమిమ్ములఁ గాంచియుండితి - కష్టములున్ గట్టుబెట్టి
క్రూరులచేఁబడి - కుందియున్నన్
కృపచేఁ గాంచియు - కూరిమిసించియు ॥క॥

సంపూర్ణము

---



శ్రీ కొండపల్లి ముద్రాశాల, రాజమంద్రి. 1952.

# జ్యోతిష గ్రంథములు

| | | రు | అ |
|---|---|---|---|
| జ్యోతిష ప్రథమబోధిని | | 0 | 8 |
| జాతకమార్తాండము | 1 భా॥ | 2 | 0 |
| డిటో | 2 భా॥ | 2 | 0 |
| డిటో | 3 భా॥ | 2 | 0 |
| జ్యోతిషరహస్యము | 1 భా॥ | 2 | 0 |
| డిటో | 2 భా॥ | 2 | 0 |
| జ్యోతిష విద్యాప్రకాశిక | | | |
| సంజ్ఞాధ్యాయము | 1 భా॥ | 1 | 0 |
| గణితాధ్యాయము | 2 భా॥ | 1 | 0 |
| భావఫలాధ్యాయము | 3 భా॥ | 3 | 0 |
| ద్వాదశభావఫలము | 4 భా॥ | 3 | 0 |
| అదృష్టదీపిక | | 0 | 10 |
| హస్తసాముద్రికము | | 0 | 6 |
| జ్యోతిషఫలప్రదర్శిని | | 0 | 10 |
| స్వప్నఫలదీపిక | | 0 | 8 |
| సకలసమస్తగుణ అదృష్టఫలదీపిక | | 1 | 0 |
| గౌతమసంహిత | | 0 | 8 |
| వాంఛానాడీయము | | 0 | 8 |
| కోడిపుంజు శాస్త్రము | | 0 | 8 |
| అంగసాముద్రికము | | 0 | 8 |
| జాతకదర్పణము | | 0 | 8 |
| జాతకపారిజాతము | | 0 | 8 |
| జాతకరాజీయము | | 1 | 0 |
| చేతావని (కలియుగ సమాప్తి) | | 0 | 6 |
| దైవజ్ఞకర్ణామృతము తా॥ ప॥ | | 2 | 0 |
| కాలచక్రము (చేతావని ఖండన) | | 0 | 6 |
| ప్రపంచజ్యోతిషము | | 0 | 4 |
| జ్యోతిషఫలగ్రంథము | | 0 | 4 |
| పంచపక్షిప్రశ్నశాస్త్రము | | | |
| కేరళప్రశ్నశాస్త్రము | | | |
| ఉత్తమప్రశ్నశాస్త్రము | | 1 | 0 |

| | | రు | అ |
|---|---|---|---|
| శకునశాస్త్రము | | 0 | 12 |
| స్త్రీజాతకము | | 0 | 12 |
| యవనజాతకము | | 0 | 8 |
| జ్యోతిషార్ణవనవనీతము | | 1 | 8 |
| దైవజ్ఞకర్ణామృతము | | 2 | 8 |
| దశాభుక్తిఫలచంద్రిక అను వృద్ధపారాశరి | | 1 | 0 |
| పుట్టుమచ్చలశాస్త్రము | | 0 | 8 |
| జాతకచంద్రిక గోపాలరత్నాకరము | | 0 | 8 |
| నక్షత్రచింతామణి | | 0 | 4 |
| స్త్రీఋతుశాస్త్రము అను రజస్వలాజాతకము | | 0 | 8 |
| మూలస్తంభం (శైవగ్రంథం) | | 0 | 8 |
| రత్నపరీక్ష | | 0 | 6 |
| గర్గసంహిత | | 0 | 4 |
| జైమినీసూత్రములు | | 1 | 0 |
| అనుభవజాతకతరంగిణి | | 0 | 8 |
| పూర్వపారాశరి | | 0 | 8 |
| బృహత్పారాశరసంహిత | | 0 | 4 |
| ఆంధ్రజాతకతత్వము సూత్రములు | 1వ భా॥ | 1 | 8 |
| డిటో | 2వ భా॥ | 1 | 8 |
| గోచారసంహిత | | 0 | 12 |
| కాలామృతము | | 1 | 0 |
| శిల్పసంగ్రహము | | 0 | 8 |
| ఆరోగ్యాయుర్యోగము | | 1 | 0 |
| ముహూర్తదర్పణము | | 1 | 0 |
| గొట్టుబత్తశాస్త్రము 60 సంవత్సరముల పంచాంగము | | 1 | 0 |
| సర్వార్థచింతామణి | | 1 | 0 |

# ఆంధ్ర నాటకములు

| | రు. | అ. |
|---|---|---|
| బళ్ళారి ధర్మవరం గోపాలాచార్యులుగారి | | |
| రామదాసు | 1 | 8 |
| బళ్ళారి కె. బాలసరస్వతి, బి. ఏ. బి. ఎల్. గారి | | |
| భక్తతుకారామ్ | 1 | 8 |
| గురజాడ అప్పారావుగారి | | |
| కన్యాశుల్కము | 2 | 0 |
| బళ్ళారి పండిత కె. సుబ్రహ్మణ్యంగారి | | |
| కృష్ణలీల | 1 | 8 |
| లవకుశ | 1 | 8 |
| భక్తకుచేల | 1 | 8 |
| మేవాడు శౌర్యాగ్ని (చరిత్రాత్మక నాటకము) | 1 | 8 |
| విభీషణ పట్టాభిషేకము అను (లంకాదహనము) | 1 | 8 |
| ద్రౌపదీ వస్త్రాపహరణము | 1 | 8 |
| మిహిర (పద్మిని) | 1 | 8 |
| సామ్రాజ్యపట్టాభిషేకము | 1 | 8 |
| విషాదవిక్రమ (ఒథెలో అను నాటకమునకు అనువాదం) | 1 | 8 |
| అవటపల్లి హనుమంతరావుగారి | | |
| మహాకవి కాళిదాసు | 2 | 0 |
| ముతినేని వెంకట చెన్నకేశవులుగారి | | |
| తులసీదేవి (సతితులసి) | 1 | 8 |
| చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి | | |
| గయోపాఖ్యానము | 1 | 12 |
| ప్రసన్నయాదవము | 1 | 8 |
| పారిజాతాపహరణము | 1 | 8 |
| చతురచంద్రహాసము | 1 | 8 |
| తిలోత్తమ | 1 | 8 |

| | రు. | అ. |
|---|---|---|
| చందాల కేశవదాసుగారి | | |
| కనకతార | 1 | 8 |
| మల్లాది అచ్యుతరామశాస్త్రిగారి | | |
| సక్కుబాయి (అసలు స్టేజి నాటకము) | 1 | 8 |
| శ్రీరాముల సచ్చిదానందశాస్త్రిగారి | | |
| సావిత్రి | 1 | 8 |
| కీ. శే. కాళ్ళకూరి నారాయణరావుగారి | | |
| వరవిక్రయము | 1 | 8 |
| పద్మవ్యూహము | 1 | 8 |
| చిత్రాభ్యుదయము (సారంగధర) | 1 | 8 |
| బలిజేపల్లి లక్ష్మీకాంతం కవిగారి | | |
| సత్యహరిశ్చంద్రీయము | 2 | 0 |
| కవిరాజ కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి | | |
| బొబ్బిలియుద్ధము | 1 | 8 |
| విష్ణుభట్ల సుబ్రహ్మణ్యంగారి | | |
| సారంగధర | 1 | 8 |
| కాజ రాధాకృష్ణశాస్త్రిగారి | | |
| జన్మభూమి | 1 | 4 |
| అమరజ్యోతి | 1 | 8 |
| మాధవశర్మ | 1 | 8 |
| ఝాన్సీరాణి | 1 | 8 |
| కొప్పరపు సుబ్బారావుగారి | | |
| రోషనార | 1 | 8 |
| మా॥ పురం॥ అప్పారావు పట్నాయక్ గారి | | |
| రేవతి | 1 | 8 |
| పినిశెట్టి శ్రీరామమూర్తిగారి | | |
| కులంలేనిపిల్ల | 1 | 8 |
| గూడూరి కోటేశ్వరరావుగారి | | |
| శాంతామతి | 1 | 8 |